కౌసల్య ప్రొడక్షన్స్ వారి

# మంచిరోజులు వస్తాయి

దర్శకత్వం: ట. విశ్వనాథం రచన: ఆరుద్ర సంగీతం: కోదండపాణి

నిర్మాతలు: ఎ. భావనారాయణ • P.C. బాలకృష్ణరాజు



పూర్ణా రిలీజ్

గంగాధర్

REVATHI

# నేడే చూడండి!







ప్రసాద్ ఆర్టు పిక్చర్సు
చిత్రం

# పునర్జన్మ



నిర్మాత.. ఎ.వి.సుబ్బారావు
స్క్రీన్‌ప్లే-దర్శకత్వం..కె.ప్రత్యగాత్మ



నవయుగ

# ఉత్తరాలు

## కథలు

విడదవోలు మాలతిగారి, 'నడుస్తున్న చరిత్ర' కథ చాల బావుంది స్త్రీ కోరికలు బలవంతంగ ఎలా అణగారిపోతాయో రచయిత్రి చక్కగా వివరించి చూపించారు తనకు తీరని కోరిక మనుమరాలికైనా తీరాలని ఆ పాప పేరు 'విజయభారతి' అని పెట్టమని రాయమంటం, చాల సహజంగ ప్రతి స్త్రీకి ఉండే కోరికలలాగ ఉన్నాయి

సుధానాద్ (భోపాల్)

## దశావతారాలు

16—8—63 తేదీ సంచికలోని 'దశావతార మాల' ఎందుకు ప్రచురించారో అగమ్యము ఎందుచేత ననగా నాట్యము తెలిసినవారికి మీ 'దశావతార మాల' అనవసరము ఇక నాట్యము తెలియనివారికంటేరా, దీనివలన వారు గ్రహించేది శూన్యము అది అట్లా ఉంచండి మీ 'దశావతారమాల' లోని అవతార భంగిమలు కూచిపూడి నాట్య పద్ధతివి అని ప్రచురించినారు కాని కూచిపూడి నాట్య పద్ధతికి పూర్తి విరుద్ధముగా భంగిమలు ప్రచురింపబడినవి కూచిపూడి నాట్యపద్ధతి ప్రకారము—

"యతో హస్త స్తతో దృష్టిః
యతో దృష్టిః తతో మనః
యతో మనస్ తతో భావః
యతో భావస్ తతో రసః"

అనగా హస్తములచేత అర్థమును అభినయించి చూపునపుడు, చేతులు ఎక్కడికి పోవునో, ఆచోటకు కన్నులు కూడా తిరుగవలెను దృష్టి ఎక్కడక్కు మరలెనో అక్కడ మనస్సు నిమగ్నము కావలెను మనస్సుతోపాటు భావమును అప్పుడే రసపుష్టి అటువంటప్పుడు చూచువారి కన్నులు కూడా నర్తకి కన్నుల ననుసరించి, ఆమె హస్త ముద్రికలపై బడి భావమును అర్థము చేసుకొనుటకు వీలుండును కాని మీ 'దశావతారముల' లోని నర్తకి హస్తముల మీద దృష్టి నుంచక ఫోటో కొరకు 'ఫోజ లిచ్చినది' పోని హస్తముద్రికలైననూ కూచిపూడి సాంప్రదాయముగా లేవు ముఖ్యముగా వరాహావతారం, వామనావతారం, కల్క్యవతారములు పూర్తి విరుద్ధములుగా ఉన్నవి

కె ఎస్ రామారావు (మచిలీపట్టణము)

## బొమ్మల కథ

గత వారం ప్రకటించిన "రంగూ మంగూ" శీర్షిక చాలా బాగుంది శ్రీ జయదేవ్‌గారికి అభివందనములు అందజేయండి

అడవి రామకృష్ణారావు (వైజాగ్)

## తెరమీద-తెర వెనుక

తెరమీద, తెర వెనుక శీర్షిక క్రింద నా అభిమాన తార అంజలీదేవిని పరిచయం చేసినందుకు నా అభివందనములు తెలుపకుండా ఉండలేక పోతున్నాను నమ్ముతారా !

మురహరి (పాయకరావుపేట)

* *

ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రఖ్యాత సినీ నటుడు శ్రీ జగ్గయ్యగారి పరిచయం చాలా బాగుంది శ్రీ జగ్గయ్యగారు సినీ జీవుల జీవితాల్ని గురించి మాట్లాడుతూ "సినిమా కెరీర్‌లో ఉన్నవాళ్ల భవిష్యత్తుకు సెక్యూరిటీ ఏమిటి ? వాళ్లకు ప్రావిడెంటుఫండా ? పెన్షనా ? లేక రిటైర్‌మెంటు వయస్సుదాకా ఉద్యోగ హామీయా ? ఏమిటి ఉన్నది?' అన్నారు మరియు "రాబడిని బారేజి చేసి చూస్తే మిగతా వృత్తులలోకి మళ్లీ అది సరిగానే ఉంటుంది" అన్నారు

కాని, పగలనక రేయనక కష్టించి పనిచేసే కర్షకులకు పన్నులు, వ్యవసాయ ఖర్చులు పోను ఏమాత్రం మిగులుబాటు ఉంటుంది? శ్రీ జగ్గయ్యగారే జవాబిస్తే వినాలని ఉంది ఎంతో శ్రమకోర్చి కష్టపడి ఆర్జిస్తే ప్రభుత్వం పేరుతో వారి కష్టాన్ని దోచి సకుటుంబ సమేతంగా ప్లిమత్ కార్లలో వెళ్లి వూటీ, కొడైకెనాల్‌లలో విశ్రమించే కాంగ్రెస్ మంత్రివర్యుల చర్యలను కాంగ్రెస్ అభిమాని శ్రీ జగ్గయ్యగారే తెలియపరచాలి

అత్యవసర పరిస్థితుల సాకుతో పేద రైతులను పీల్చి పిప్పిచేసి శక్తికి మించిన డబ్బును దౌర్జన్యముగా వసూలుచేసి ఆ డబ్బుతో భోగ విలాసాలతో మునిగి తేలుచున్న దేశభక్తులు ఎంతమంది లేరు ? కాని పేరుకు వారంతా దేశభక్తులే

మురికి (పల్లె) సీమల్లో నివసించే పేదరైతు తన కష్టార్జితాన్నే తను అనుభవించలేక, చావలేక బ్రతుకలేక ఉన్నాడు మరి అతనికి ప్రావిడెంటు ఫండా ? పెన్షనా ? వైద్య సౌకర్యాలా ? పంట పండుతుందన్న హామీయా ? లేక ఉదర పోషణకై అప్పులపాలై తనకున్న కొద్దిపాటి భూమిపరుల పాలుకాకుండా హామీయా ? ఈ ప్రశ్నలకు శ్రీ జగ్గయ్యగారే సమాధానమిస్తే విని సంతోషిస్తాము

చాలీచాలని జీవితాలతో సతమత మవుతున్న పేదరైతు తన స్థితిని అవలోకన చేసుకుంటే కన్నీటిబొట్లు కాదు రక్తాశ్రువులు మిగులుతాయి.

కె వి రంగారెడ్డి (కొత్తకోట)

## త్యాగరాజకీర్తన

మీరు ప్రచురించిన జి ఎస్ బాలసుబ్రహ్మణ్యం పాడిన త్యాగరాజ కీర్తన ఎంతో బాగున్నది ఈ కీర్తన మాకు వచ్చినప్పటికి దీనిలోని మృదుమాధుర్యము ఎంతో మమ్మల్ని ముగ్ధుల్ని చేసింది మీరు ప్రతీవారం ఈవిధంగా ప్రచురించి మాకు కొంత కాలక్షేపము కలుగజేస్తారని ఆశిస్తున్నాము. ఈ కీర్తన చూసి నాకు వెనుక మీరు ప్రచురించిన శ్రీ సీతారామ స్తుతి గుర్తుకొచ్చింది ఆ కృతులు ఎంత బాగున్నాయి!

ఎస్. బాలసరస్వతీశర్మ (విశాఖపట్నం) ★

## రచయితలకు మనవి

ఆంధ్రసచిత్ర వారపత్రికకు తమ రచనలు పంపేవారు ఈ క్రింది నిబంధనలు గమనించాలి

**కథలు, వనితాలోకం వ్యాసాలు, గేయాలు, కార్టూన్లు:**

● ప్రచురణకు స్వీకరింపబడని రచనలు తిప్పి పంపగోరే వారు వ్రాతప్రతితో బాటు తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవరు పంపాలి.

● ప్రచురించబడని రచనల విషయమై ఏ విధమైన ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు

● తిప్పి పంపబడే రచనల వ్రాతప్రతులు సాధారణమయిన బుక్‌పోస్టు ద్వారా మాత్రమే పంపగలము కాబట్టి రచయితలు దీనికి సరిపడే తపాలా బిళ్లలు మాత్రం పంపితే చాలు. తపాలా బిళ్లలు వ్రాత ప్రతి బరువుకి సరిపోయేట్లు ఉండాలి.

● వ్రాతలు సక్రమంగా రచయితలకు తిప్పి పంపే ప్రయత్నాలు అన్నీ చేస్తాము, కాని వాటి విషయమై ఏ విధమైన బాధ్యతనీ వహించ లేము

● రచనతో బాటుగా కాక వేరుగా పోస్టేజీ పంపినా వ్రాతప్రతులు తిప్పి పంపబడవు

**కథకాని కథలు, ఉత్తరాలు, వనితావాణి :**

● ఏ సందర్భంలోనూ పై శీర్షికకు సంబంధించిన వ్రాతప్రతులు తిప్పిపంపబడవు

**నవలలు :**

● ప్రచురణకు స్వీకరించని నవలల వ్రాతప్రతులు పోస్టేజి జతపరచకపోయినప్పటికీ తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని రిజిస్టర్డ్ పోస్ట్‌లో తిప్పిపంప గోరేవారు రిజిస్ట్రేషన్ ఛార్జికి కావలసిన కనీస మొత్తం (65 నయాపైసలు) వ్రాతప్రతితోబాటే తపాలాబిళ్లల రూపంలో పంపాలి

● వ్రాతప్రతులు సక్రమంగా తిప్పి పంపే ప్రయత్నాలు అన్నీ చేస్తాము కాని ఈ విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. అంతేకాక ప్రతుల విషయమై ఏవిధమయిన బాధ్యతనీ వహించలేము

**మరొక మనవి :**

రచయితలు వ్రాతప్రతి మీదనే తమ పేరు, పూర్తి చిరునామా స్పష్టంగా వ్రాయాలి లేనట్లయితే ప్రతిఫలం పంపటం కష్టం అవుతుంది

సం॥

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# దీపావళి కథల పోటీ

**మొదటి బహుమతి: రు. 650**

**రెండవ బహుమతి: రు. 450**

**మూడవ బహుమతి: రు. 225**

ప్రతి సంవత్సరం మాదిరిగానే ఈ సంవత్సరం కూడా దీపావళికి కథలపోటీ నొకదాన్ని నిర్వహించ నిశ్చయించాము రచయితలందరూ ఎప్పటిపలెనే ఈ అవకాశాన్ని వినియోగించుకుని పోటీ జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము.

## నిబంధనలు

- కథలు స్వంత రచనలై ఉండాలి అనువాదాలు అనుసరణలు పంపకూడదు.
- ఇతివృత్తం వీలైనంతవరకు ఆంధ్ర ప్రజాజీవనానికి దగ్గరగా వుంటే బాగుంటుంది.
- కవరుపైన 'దీపావళి కథలపోటీకి' అని స్పష్టంగా వ్రాయాలి.
- రచన ఇరవై అరఠావు పేజీలకు మించరాదు
- రచనలు కాగితానికి ఒకవైపుననే వ్రాయాలి రెండు ప్రక్కల వ్రాసిన రచనలను పరిశీలించటం జరగదు.
- పోటీలో బహుమతి పొందని కొన్ని కథలను విడిగా ప్రచురించవచ్చు.
- **వ్రాతప్రతులు 21-9-63 లోగా మా కార్యాలయానికి చేరాలి.**
- రచనలు తిప్పిపంపగోరేవారు, స్వంత చిరునామా గల కవరుకు తగు తపాలా బిళ్ళలు అంటించి రచనలతో జతపరచి పంపాలి దరిమిలా పంపే పోస్టేజి అంగీకరింపబడదు
- **పోటీలో తుది నిర్ణయం సంపాదకులదే. ఈ విషయమై ఏవిధమైన ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.**

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 30—8—63

శోభకృన్నామ సం॥ భాద్రపద మాసం॥ శుద్ధ ఏకాదశి
సంపుటము 55 సంచిక : 52

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా రూ. 13.00 ఇతర దేశాల. : ఓడమీద (Sea Mail) రు 20.00 (విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా 135.00)

*

విడి ప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1




ప్రముఖతార అంజలీదేవి

# మనలో మాట

తెరమీద – తెరవెనుక 'ఇంటర్‌వ్యూ'లు ఈ వారంతో అయిపోతున్నాయి. ఇంతవరకూ జరిగిన 'ఇంటర్‌వ్యూ'ల మీద ఒక సమీక్ష వచ్చేవారం ఆంధ్రసచిత్ర వారపత్రికలో పడుతుంది. ఇంచుమించు తెలుగు సినిమా రంగంలో పేరుపొందిన వారందరినీ ఇంటర్‌వ్యూ నికోరాము వీరిలో కొందరిని సకాలం కలిసే అవకాశాలు లేకపోయాయి. ఈ తెరమీద – తెరవెనుక శీర్షికని ఇంకా పొడిగించటానికి ఇష్టం లేక ఇంతటితో (ఇంటర్‌వ్యూ) ఆపివేస్తున్నాము!

*  *  *

'మరువలేని మనిషి' శీర్షిక కూడ ఈ సంచికతో అయిపోతుంది వీలయితే త్వరలో మరి కొన్ని బొంబాయి సినిమా తారల 'వ్యాసాలు' ప్రచురిస్తాము.

*  *  *

ఈ సంవత్సరం దీపావళి శుక్రవారం నాడే వస్తోంది నవంబరు 15వ తేదీ సంచిక ఆంధ్రసచిత్ర వారపత్రిక దీపావళి ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. ఈ సందర్భంలో ఒక కథల పోటీ ఏర్పాటు చేస్తున్నాము. పోటీ ప్రకటన ఇదే సంచికలో మరొక పేజీలో చూడవచ్చు!

## లోకంపోకడ



"నిర్బంధపొదుపు, అధిక పన్నులు యిత్యాదుల కారణంగా మాకు దుస్తుల శుభ్రతగురించ ఆఫీసు నిబంధనలు వుండ రాదని కోరుతున్నాం."

# విషయానుక్రమణిక



అనుయాయులకొక భాగం
ముఖ్యమంత్రి పదవి
కేంద్ర మంత్రి వర్గం
త్వరగా బయటకెళ్ళి పోండయ్యా బాబు! నే లోపలికి పోవాలి!
అప్పుడు
కాశ్మీర్ పరిష్కార మార్గంలో కొన్ని ఉభయ తారక మార్గాలు
ఇప్పుడు
లోహియా, మసాని, కృపలానీలు పార్లమెంటు సభ్యులయ్యారు! కనుక పార్లమెంటులో కావాల్సినంత సందడే.

శ్రీకృష్ణ

# బహూపతికమైన కాంగ్రెస్ పరిపాలనం: నకిలీ మందులనిలయం పాతఢిల్లీనగరం!

మన ప్రధానమంత్రి కొత్త వివాదాన్నొకటి లేవదీశారు అదేమిటంటే—దేశంలో ఫాసిస్టు తత్వాలు' తలెత్తుతున్నాయట ఈ ఫాసిజము అనే మాటను బ్రిటిష్ రాజ్యాంగవేత్త స్వర్గీయ హెరాల్డ్ లాస్కీ 1937 లో ఈవిధంగా నిర్వచిస్తూ వ్రాశారు

"ఫాసిజమంటే ఏమిటో కాదు పెట్టుబడిదారీ విధానాలు అన్నీ గుత్తకు తీసుకుని జవాన్ని బానిసలుగా మార్చి, తన ఇష్టా నిష్టాలు వాళ్లపై రుద్దటమన్నమాట దీంట్లో అన్నిటికన్న ముఖ్యసూత్రంగా కన్పించేదేమంటే శ్రామిక వర్గానికున్న రక్షణ లన్నిటినీ నాశనంచేసి పారేయటం అంతే కాదు, ప్రలోభం, పరోక్షపు బలవంతాల ద్వారా తన ఇష్టానుగుణంగా ప్రజలను అనువర్తింపచేసే రాజ్యంలో సమాజం ఒక భాగంట కూడా సాంఘికమైన విప్లవం ఉండనే ఉండదు ఉత్పత్తి కేంద్రాలన్నీ వ్యక్తులచేతుల్లోనే ఉంటాయి

"అయితే రాజకీయంగా మాత్రం విప్లవం వెలరేగుతూనే ఉంది అంటే సంఘ వ్యవస్థీకరణను విమర్శించే అవకాశంకల విభాగాలను 1933 తర్వాత నిరంకుశంగా అణచివేయటం జరిగింది వీటి స్థానంలో పెట్టుబడిదారీ విధానం, నాజీ పక్షంతో చేతులు కలపటం, బలప్రయోగంద్వారా ప్రజలను ఈ నూతన వ్యవస్థీకరణం పట్ల ఉన్ముఖులను చేయటం జరిగింది"

అయితే యిప్పుడు మన భారతీయ సమాజంలో ఏ విభాగంలో, ఈ 'పెట్టుబడిదారీ గుత్త విధాన' సూచనలు తలెత్తుతున్నాయా అనేదే ప్రశ్న

కాంగ్రెస్ ఇంటా బయటా ఏర్పడ్డ పార్టీలతో మన దేశం తలక్రిందై పోతోంది శ్రీ మొరార్జీ దేశాయి చెప్పే సంయుక్త ఆర్థిక విధానం (ఈ మాటకు సృష్టికర్త మన ప్రధాన మంత్రే) బలపరిచే వర్గం ఉంది కాంగ్రెస్‌లోని అభ్యుదయ వాదులను రెండు వర్గాలుగా చెప్పవచ్చు. ఒకటి మీన వీయులు, నందా వర్గీయులు అందులో రెండో వర్గంవారు అంటరు చర్కా, మద్యనిషేధం, సాధు సమాజాలకు అండగా ఉంటారు ఇక కాంగ్రెస్ బైట పక్షాలలోని, సోషలిస్టు,, ప్రజాసోషలిస్టులను ఫాసిస్టు లనేందుకు ఆస్కారం లేదు ఇహ మిగిలిన వాళ్లల్లా స్వతంత్ర, జనసంఘ, హిందూమహాసభ వాళ్లు హిందూమహాసభ, జనసంఘం ఎంతలేదన్నా 15 ఏళ్ల నుంచీ ఉన్నాయి గనుక ప్రధానమంత్రి ఫాసిస్టు' పదం ఉపయోగించేటప్పుడు వాటిని దృష్టిలో ఉంచుకుని అనివుండరు ఇంక మిగిలినదల్లా మహాత్మాగాంధి అనుచరుల్లో ఒకరు, క్షణచిత్త స్నేహితుల్లో ఒకరూ ఐన శ్రీమాన్ రాజగోపాలాచారి నాయకత్వాన ఉన్న స్వతంత్రపార్టీ మాత్రమే అయితే ఇప్పుడొక సందేహం కలుగుతోంది ఈ స్వతంత్రపక్షం పెట్టుబడిదారీ—గుత్తవిధాన రాజ్యాన్ని ఏవిధంగా బలపరుస్తున్నట్లు ?

**సరే ఇదిలా వుంచుదాం మరి కమ్యూనిజం మాటేమిటి? ఇది ఫాసిజంకన్నా ఎందులో మెరుగుటా!**

47 వ పేజీ చూడండి



ఢిల్లీలో ఎర్రకోటవద్ద జాతీయ పతాకం ఎగురవేసి స్వాతంత్ర్య వార్షికోత్సవ సభలో ప్రసంగిస్తున్న ప్రధాని నెహ్రూ

# అవీ - ఇవీ - అన్నీ

## మందకొడి చిత్రరంగం

మద్రాసు ఫిలిం పరిశ్రమ మరింత మందకొడిగా సాగుతోంది. చెదురు చెదురుగా ఎక్కువ చిత్రాలు తక్కువ వ్యవధిలో విడుదల కావటం, వాటిలో చాలా వాటికి బాక్సాఫీసు చుక్కెదురు కావటంతో చాలామంది నిర్మాతలు తాపీగా కూలబడి, నష్టాన్ని భర్తీ చేసుకోటాని కృష్టపడుతున్నారు స్తోమతుగల నిర్మాతలు ఏక బిగిన చిత్రాలు నిర్మిస్తున్నారు మరికొంతమంది యువకులు ఎవరెట్లాపోతే మనకేం మనం బాక్సాఫీస్ 'హిట్టటం' ఖాయం అనుకుంటూ, ఈ రంగంలోకి దూకుతున్నారు ఇంతకు మించి చెప్పుకోదగ్గ విశేషం ఏమీ కన్పడటం లేదు.

ఇంచుమించు ఇంతకన్న తక్కువ స్థితిలో వుంది తర్జుమా చిత్ర పరిశ్రమ. గత సంవత్సరంలో ఎన్నో సంస్థలు, చిత్రాలు తయారు (తర్జుమా) చేస్తున్నట్లు పత్రికలలో వేయించుకోటం తరవాత ముడి ఫిలింకు కటకట ఏర్పడటంతో వాళ్ళ ఆట కట్టే, ఈ తర్జుమా పరిశ్రమలో పని చేసేవారందరు నిరుద్యోగులయ్యే ప్రమాదం ఏర్పడుతున్నది ఈ స్థితి ఇలా కొనసాగితే మాత్రం పరిశ్రమకు కొంత ఇబ్బంది కల్గవచ్చు కాని, కొంత స్తోమతుగల నిర్మాతలు ఈ తర్జుమా కార్యక్రమానికి పూనుకుంటున్నారు.

## రాజాధిరాజు కథ

కావ్యశ్రీ పేరిట నిర్మాతలు ములుకుట్ల రామరత్నం, నిర్వాహకుడు, ములుకుట్ల సుబ్రహ్మణ్యం తయారు చేస్తున్న ఈ చిత్రంలో పద్మిని, లలిత, యం. జి ఆర్, నంబియార్, వీరప్ప నటించారు. పుష్కలంగా కత్తి యుద్ధాలు వగైరా ఉండగల ఈ చిత్రం త్వరలో విడుదలకుగాను మెరుగులు దిద్దుకుంటోంది

## నామరూపాలు - 14



అసలు చిత్రం ఆంధ్ర సచిత్ర వార పత్రికకు ప్రత్యేకం తీసినది.

## హిందీలో 'నూర్జహాన్'

లోగడ హుమాయూన్, మొఘలేఅజాం, తాజమహల్‌లాంటి మొగలాయి సామ్రాజ్య ఔన్నత్యాన్ని ప్రదర్శించే చిత్రాలు వచ్చాయి. వీటిల్లో ఇటీవలి చిత్రం 'తాజమహల్'

ఇప్పుడు మొగలాయి చరిత్రలో మరొక ఘట్టం చిత్ర కావ్యంగా రూపొందబోతోంది జహంగీర్—నూర్జహాన్‌ల ప్రణయాన్ని చిత్రించేందుకు జీనత్ ప్రొడక్షన్స్ చేస్తున్న ప్రయత్నమే ఇది

"నూర్జహాన్" అనే పేరుతో తయారు కాబోతున్న ఈ చిత్రం కూడా వర్ణ చిత్రమేట ప్రదీప్ కుమార్, మీనాకుమారిలు జహంగీర్, నూర్జహాన్‌ల భూమికలు వహిస్తున్నారు

షేక్‌ముక్తార్ నిర్మాతగా, యం. సాదిక్ దర్శకత్వంలో తయారు కాగల ఈ చిత్రంలో రెహమాన్, లలితాపవర్, వీణా, నాసిర్, చలం, ఉమాదత్, రాజన్ హక్సర్, ప్రకాశ్‌ముక్రీ, టుంటుం, నిర్మాత షేక్ ముక్తార్ నటిస్తున్నారు. మాటలు యం సాదిక్, మల్తాన్‌పురీ, ఛాయాగ్రహణం: నారిమన్ ఇరానీ, కళ ఎ ఎ. మజీద్, పాటలు షకీల్ బదయూనీ, సంగీతం రోషన్

ప్రతి సామ్రాజ్య చరిత్రలోను కొన్ని ముఖ్యమైన, మరపురాని ఘట్టాలు చలన చిత్రాలుగా రూపొందితే ఎంతో బాగుణ్ను

## 'ముఝే జీనేదో'

ఉత్తర, మధ్య ప్రదేశ్‌లలోని భయంకర బందిపోటు దొంగల జీవితం ఆధారంగా అజంతా ఆర్ట్స్ నిర్మించిన చిత్రం 'ముఝే జీనేదో' చిత్రం సెన్సారయింది

సునీల్‌దత్, వహీదా రెహమాన్, అన్వర్‌హుస్సేన్, రాజేంద్రనాథ్, నిరూపరాయ్ సిద్ధూ, దుర్గాఖోటే అసితుసేన్, తిరన్‌బోస్, ముంతాజ్, కృష్ణధావన్, మూసన్ అబ్దుల్లా పాల్గొన్న ఈ చిత్రానికి దర్శకుడు మోనీ భట్టాచార్య స్క్రీన్‌ప్లే—ఆగా జానీ కాశ్మీరి, పాటలు సహీర్ లుధియానవీ, సంగీతం జయదేవ్

## ఇంగ్లీష్‌లో డా ఝివాగో చిత్రం

రష్యన్ నవలా రచయిత బోరిస్ పాస్టర్నాక్ రచన, నోబిల్ బహుమతిప్రధం డా ఝివాగోను ఇంగ్లీషులో చలన చిత్రంగా రూపొందిస్తున్నారు. దీంట్లో ముఖ్య పాత్రలు బర్ట్ లంకాస్టర్ నిర్వహిస్తాడు సుమారు ఒక కోటి డాలర్ల ఖర్చుగల ఈ చిత్రానికి నిర్మాత: కార్లో పాంటే, డేవిడ్ లీన్ దర్శకత్వం వహిస్తాడట

## 'దూర్ కి ఆవాజ్'

సాయిరాబానూ జాయ్‌ముఖర్జీలు నాయికా నాయకులుగా దేవేంద్ర గోయల్ నిర్మించే వర్ణ చిత్రం 'దూర్ కి ఆవాజ్' చిత్రంలో చాలా భాగం పూర్తి కావచ్చింది

దేవేంద్ర గోయల్ స్వయంగా దర్శకత్వం వహించే ఈ చిత్రానికి మాటలు పండిట్ ముఖ్రాం శర్మ పాటలు షకీల్ బదయూని, సంగీతం రవి, ఛాయ పాండురంగనాయక్

జానీవాకర్, ప్రాణ్ ఓం ప్రకాశ్ దుర్గాఖోటే, మనోరమా మల్కా ఇంకా పలువురు నటిస్తున్నారు.

## వర్ణ చిత్రం

'మల్కా—ఏ—హిందూస్తాన్' నూర్‌జహాన్ మొఘల్—ఏ—ఆజాం నిర్మాత ఆసిఫ్ కూడా పై భారీ వర్ణ చిత్రాన్ని నిర్మిస్తున్నాడు. చిత్రానికి పాటలు: సహిర్ లుధియానవి, సంగీతం: నౌషద్ అలీ.



లక్షాధికారిలో రామారావు

ఎ ఆర్ కర్దార్ దర్శకత్వం వహించే ఈ చిత్రంలో కొత్త నటుడు ప్రధాన భూమిక నిర్వహిస్తారట

## జకోస్లవేకియా చిత్రానికి ప్రిక్స్ బహుమతి

ఫ్రాన్సులోని అన్నెసీలో ఇటీవల జరిగిన ఐదవ అంతర్జాతీయ కార్టూన్ చలన చిత్రోత్సవంలో జిరిబ్రడెకా దర్శకత్వం వహించిన 'ది బాడ్ ఫ్రీడాన్ చికెన్' అన్న జకోస్లవేకియా చిత్రానికి గ్రాండ్ ప్రిక్స్ బహుమతి లభించింది

## సినిమాహాలుగా ఆంధ్ర మహాసభ భవనం

మద్రాసు, ఆంధ్ర మహాసభ సమావేశాలు సభలు ప్రదర్శనాలు జరిగే విక్టోరియా పబ్లిక్ హాల్ త్వరలో సినిమా హాలుగా రూపొందబోతోంది ఈ భవనం నిర్వాహకులు మద్రాసులోని సహాని థియేటరు అధిపతులు ఆర్ యమ్ సహాని అండ్ కంపెనీ వారికి భవనంలో మొదటి అంతస్థు అనగా మామూలుగా నాటక ప్రదర్శనాలు జరిగే చోటు (గ్రాండ్ ఫ్లోర్)ను అద్దెకు ఇస్తూ ఒప్పందాన్ని కుదుర్చుకున్నారట

చుట్టుపట్ల ఉన్న ఖాళీ స్థలాన్ని ఓపెన్ థియేటరు కాఫీ హోటలు నడిపేందుకు వేరే ఇంకొకళ్ళకు అద్దెకు ఇచ్చివేశారట

ఈ భవన నిర్మాణానికి దోహదం చేసిన వ్యక్తి

49 వ పేజీ చూడండి

సహ నాయిక పాత్రలు ధరించే నటి జయంతి.

# రాజధానిలో స్వాతంత్ర్య కోలాహలం: కలతలకు దారితీసే కాంగ్రెస్ తీర్మానం!

మళ్ళీ ఆగస్టు పదిహేను వచ్చింది వెనుకటివన్నీ జ్ఞాపకం వస్తున్నాయి స్వాతంత్ర్యోద్యమంలో గాంధీజీ నాయకత్వం క్రింద భారత ప్రజానీకం చేసిన అశేషమైన త్యాగాలు తలుచుకుంటుంటే ఒళ్ళు జలదరిస్తోంది ఆనాటి వాతావరణం అలాంటిది ముందూ వెనకా ఆలోచించటమనేదే ఉత్పన్నం కాలేదు మహాత్ముని పిలుపు, మన విధ్యుక్త ధర్మం ఈ రెండే! సర్వస్వం వదులుకున్న తర్వాత కూడా మనస్సుకు చీకూ చింతా కలగలేదు జైళ్ళలోకి వెళ్ళటమే కాదు లాఠీదెబ్బలు తినటమే కాదు ప్రాణాలు అర్పించటమే కాదు, ఏది చేసినా, ఒకటే ధ్యేయం, ఒకటే లక్ష్యం తుపాకీ గుండ్లకు బలి అవుతున్నప్పుడూ, మనసు చలించలేదు అమరజీవుల్ని తలుచుకుంటూ 'పదండి ముందుకు' అనే భావంతో ప్రజంతా ఒక్కుమ్మడిగా కదిలింది ఇంత ఐకమత్యం, స్వార్థత్యాగం, మనం పెట్టుకున్న లక్ష్యంలోనే ఇమిడిఉంది అదే దృక్పథంతో అందరం కదిలి, మన భూభాగంలోనే తిష్ఠ వేసుకొనిఉన్న పరదేశీయుల్ని పారదోలాం 1947 సంవత్సరం, ఈ తారీఖుయొక్క విశిష్టత అదే! అంతవరకూ కూడా, ఏ నాయకుడూ కూడా, ఏ కార్యకర్త కూడా తన భవిష్యత్తు ఏమిటి అని ఆలోచించటంగాని, మన జీవితకాలంలో యిలాంటి సుదినం వస్తుందని కాని అనుకోవటం జరుగలేదు ఆగస్టు పదిహేనవ తారీఖు యింత త్వరగా వచ్చేటప్పటికి ఆశ్చర్య విభ్రమాలు కలిగినాయి!

ఆనాటినుంచి మనవాళ్ళే మన దేశాన్ని పరిపాలించటం మొదలుపెట్టారు ఏటేటా జరుపుకుంటున్న ఈ తారీఖు తాలూకు ఉత్సవాలు మనల్ని కర్తవ్యోన్ముఖుల్ని చెయ్యటానికి ఉపకరిస్తూ ఉంటున్నాయి మామూలుగా జరిగే విన్యాసాలు సికిందరాబాదు పెరేడ్ మైదానంలో జరిగినాయి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వందన స్వీకారం చేశారు అధికారులు, అనధికారులు ఎంతో మంది వీటిని తిలకించటానికి రావటమే కాకుండా పెరేడ్ మైదానం చుట్టూ జనం విపరీతంగా గుమిగూడి శ్రద్ధాసక్తులు కనపర్చారు

1947 నాటి భావాలు మళ్ళీ స్ఫురణకు వస్తున్నాయి ఆనాడు దేశంలో అంటిపెట్టుకున్న పరదేశీయుల్ని వెళ్ళగొట్టటం సమస్యయితే ఈనాడు మన దేశాన్ని కబళించటానికి, క్రూర దృష్టితో పొంచివున్న శత్రుమూకను ఎదుర్కొనటం సమస్య హిమాలయాల్ని సైతం లెక్కచెయ్యకుండా కుటిలోపాయాలతో ఉత్తర దిశన వలుకరిస్తున్న కమ్యూనిస్టు చైనా, మన దేశంలోపలికి రాకుండా కాపాడుకోవటం, ఈనాటి లక్ష్యం దీన్ని ప్రతి భారతీయుడు గుర్తించాడు ఈ లక్ష్యసిద్ధికి ఎంతటి త్యాగాన్నయినా చేయటానికి మళ్ళీ సిద్ధంగానే ఉన్నానంటూ ప్రతివాడు ముందు కొస్తున్నాడు ఈ ఉత్సాహం, దేశభక్తి, ప్రతి వానిలోనూ ఉజ్జ్వలంగా కనపడుతూనే ఉన్నాయి జంట నగరాల్లో చక్కగా తోరణాలు కట్టారు జాతీయ పతాకాలు నిర్భయంగా ఎగురుతున్నాయి ఈ పతాకం ఈవిధంగానే ఎల్లకాలం ఎగిరేలాగున శపథం తీసుకుంటున్నారు దేశభక్తి ప్రబోధితమైన పాటలతోనూ, నినాదాలతోనూ ఉద్రిక్తులయిపోతున్నారు ఏ సెంటర్లో చూసినా ముందుగా పిల్లలు త్రివర్ణ పతాకాలతో హాజరు, పిల్లల చిరునవ్వుల్లో దాక్కున్న భావి భారత భవిష్యత్తు, పెద్దల్ని, మరింత ఉత్సాహపూరితుల్ని చేస్తోంది ఏ పరిస్థితుల్లో నైనా సరే ఈ చైనా మూకను చెండాడి, తగిన బుద్ధి చెప్పి తీరుతాం అని దృఢనిశ్చయులై ఉన్నారు భారత ప్రజానీక ముక్తకంఠమే శత్రు పరాజయానికి

46 వ పేజీ చూడండి



జాతీయ సైనిక విద్యార్థిదళం స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంలో జరిపిన ప్రత్యేక కవాతును ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి రాజధానిలో తిలకించారు.

# బాంధవ్యం

## రంగధామ్



మనిషి ఎప్పుడైనా వంటరిగా కూర్చొని ఆలోచిస్తే, విధిగా జ్ఞాపకం వచ్చే విషయాలలో అతని బాల్యం ఒకటి ఈ దశలో మానవుడు తన సన్నిహితుల ప్రేమను తప్పక చవిచూస్తాడు అందువల్ల ఆ ప్రేమ, అతని లేత హృదయంలో ఒక చెరగరాని ముద్ర వేస్తుంది

నాకు ఎప్పటికీ మరుపురాని వ్యక్తి మా అమ్మమ్మ నా చిన్నప్పుడు, ఆవిడ ప్రక్కను పడుకొని కథలు చెప్పమని వేధించేవాణ్ణి. అప్పుడు నాకు ఆరేళ్ళు. ఆ రోజులు నాకింకా జ్ఞాపకమున్నాయి కాశీ మజిలీ కథలు, భారత భాగవతాలూ, విక్రమార్కుడి కథలూ ఇంకా ఎన్నో వోపికగా చెప్పేది నేనంటే ఆవిడకి చాలా ప్రీతి. రాత్రిళ్ళు ఏవో ఫలహారాలు చేసుకుని, నాకు విధిగా పెట్టేది ఆవిడ రాత్రిపూట భోజనం చెయ్యదు, అందుకని గోధుమరొట్టె, మినపరొట్టె, అట్లూ, చేగోడీలూ, మొదలైన ఫలహారాలు చేసుకునేది. అమ్మమ్మ చేతిలో అమృతం ఉందేమో ననిపిం

చేది అవి తింటూంటే ఇవి కాక రాత్రి కథ చెప్పడం అయ్యాక నా చేతిలో ఒక కోవా బిళ్ల పెట్టేది నా కొకసారి జబ్బుచేస్తే, రాత్రింబగళ్లు మేల్కొని సేవ చేసింది ఆ సేవ నా జన్మలో మరిచి పోను వాత్సల్యం ముద్దగట్టి పోతపోసిన మూర్తి ఆమె

అమ్మమ్మంటే మా అమ్మగారి కన్నతల్లికాదు మా అమ్మకు వరసకు పెత్తల్లి అవుతుంది ఆమెకు పిల్లలు లేరు కొద్దిగా స్థితిమంతురాలు బంధువులంటే తగని అభిమానం మా అమ్మగారి అమ్మగారి నావిడ పెంచింది ఆ మమకారంచేత ఆవిడ సంతానం ఐదుగురు ఆడపిల్లలూ, నలుగురు మగపిల్లలు కూడా ఆమెచేత పెంచబడ్డారు వీళ్లందరి పెళ్ళిళ్లూ చేయించింది ఇవికాక బంధువులవి, కాస్త తక్కువ స్థితిలో ఉన్నవాళ్ల పిల్లలివి సుమారు పాతిక మంది పెళ్లిళ్లు తన ఖర్చుతో చేయించింది ఎన్ని పురుళ్లు పోసిందో లెక్కలేదు ఆమెక వైద్యం తెలుసు, జ్యోతిషం వచ్చు వ్యవహారాలు చేయించగలదు ఆమె పేరు గంగమ్మ ఆ చుట్టు పక్కల ఎవరింట్లో ఏ కార్యం వచ్చినా గంగమ్మగారుండి జరిపించాలిసిందే ఆవిడ మాటలలో ఏదో తీపి ఉండేది ఎలాటివారైనా ఆమెతో మాట్లాడాక, ఆమె చాలా విశిష్టమైన వ్యక్తి అని అనుకునేవారు ఆమె వలన ఉపకారం పొందనివార ఆ వూర్లో లేరేమో ననిపించేది

ఆవిడది రాజమండ్రీ వద్ద రంగాపురం అని ఒక చిన్న పల్లెటూరు వేసవికాలపు సెలవలికి, మేమావూరు వెళ్తుండేవాళ్లం నాకు కొంత జ్ఞానం వచ్చి ధర్మశాస్త్రం, శాస్త్రం చదివే రోజుల్లో, అమ్మమ్మ మమ్మల్నెంత అభిమానంగా చూసేదో నా కిప్పటికీ జ్ఞాకపం వస్తూఉంటుంది చిన్న ముంతలో, మీగడతో కూడిన పెరుగు, ప్రత్యేకం నాకోసం తోడుబెట్టినది అన్నంలో వేసేది మామిడిపళ్లూ, ఫలహారాలూ చెప్పనే అక్కరలేదు ప్రతి ఏడూ విధిగా నాలుగైదు జతల కొత్త బట్టలు కుట్టించేది ఇలా నా కొక్కడికే కాదని, కొంచెం హెచ్చు తగ్గుగా బంధువుల పిల్ల లందరికీ చేసేదని తరువాత తరువాత తెలుసుకున్నాను ఆమెకు బంధువులంటే విపరీతమైన ప్రీతి ఆమె ఒక్కర్తె కాదు, మా బంధువులలో ఇంకా కొంద రున్నారు వారు, చుట్టాలు తమ యింటికి వచ్చారంటే, ఎంత మర్యాద చేసేవారో చెప్పలేం

వారంతా ఆ తరంవారు తరతరాలుగా తరగని ఆస్తుల్ని తమ బంధువుల్నాదరించడంలో పోటీలు పడి తగలేసుకుని తిరిపె మెత్తుకునే స్థితికి వచ్చిన వారున్నారు లోకం దృష్టిలో వారు, కేవలం అప్రయోజకులుగా కన్పించవచ్చు కాని భర్తృహరి ఇలాంటివాళ్లని సజ్జనుల లిస్టులో చేర్చి తీరుతాడు

ప్రస్తుత తరంవాళ్లు మట్టుకు భర్తృహరి వద్ద, మంచి సర్టిఫికెట్టు సంపాదించడానికి అంత తాపత్రయ పడరు ఎందుకంటే, ఈ రోజుల్లో ఎవడి మట్టుకు వాడే అతి కష్టంమీద జీవన యాత్ర గడుపుతూంటే, ఒకరిని ఆదరించి పోషించడం వాడి కెలా సాధ్యమవుతుంది! అప్పటిలా చవక రోజులు కావాయే, అప్పటి అభిమానా లెలా వస్తాయి ? ఇప్పుడు బంధువులకు ఎంత దూరంగా ఉంటే అంత మంచిదనుకునే రోజులు వచ్చాయి అయినా ఎంత తప్పించుకుందామన్నా, ఎప్పుడో ఒకప్పుడు బంధువులు వచ్చి, కాస్త తిన్నగా నడుస్తున్న జీవనరథాన్ని గతుకుల బాటల్లోకి తోసేసి చక్కా పోతుంటారు

బంధుత్వం అనేది ఒక హక్కుగా భావించి, తమ బంధువుడైనవాడు తమకు అన్నివిధాలా సాయం సాయంచేసి తీరాలని భావించే మనస్తత్వం, బంధువులలో మాటికి తొంభై మందికి ఉంటుంది అందుకని బంధురీత్యా వాళ్లు కొన్ని కోరికల్ని కోరుతుంటారు మనలో ఏమాత్రము మెత్తని మనస్సు కన్పించినా, అవి మన తాహతుకు మించినవైనా సరే మనం నెరవేర్చి తీరవలసిందే

గిరిజ విషయం సరిగ్గా అలాగే జరిగింది ఆమె నాకు వరసకు చెల్లె లవుతుంది కొద్దిగా దూరవు చుట్టరికం అయినా దాని వివాహ బాధ్యత నామీద పడింది. కారణ మేమంటే, వాళ్ల వాళ్లు కొంతవరకరికంలో ఉన్నారనే చెప్పాలి. నా పరిస్థితి కాస్త పైపైన మెరుగుగా కన్పించడం కూడా తోడయింది

"ఒరేయ్ రామం, గిరిజ బాధ్యత పూర్తిగా నామీద వదిలేస్తున్నాంరా అది నీ చెల్లెలు నువ్వా పట్నంలో రెండొందలు సంపాదించుకుంటున్నావు, మహరాజులా ! నువ్వు తల్చుకుంటే ఇట్టే సంబంధం కుదిరిపోతుంది కానీ నువ్వు వెయ్యి వ్యాపకాల మనిషివి గుండెలు మీద కుంపటిలా ఉంటేనే గాని నీకేమీ జ్ఞాపకం ఉండదు అందుకని దాన్ని నీ దగ్గరే ఉంచిపోతున్నాను కోడలు కూడా ఉంచమని అంటోంది" అని మా పెత్తల్లి, గిరిజ తల్లి, నాతో చెప్పింది

ఆవిడ మాట లన్నింటికీ కొద్దిగా వ్యాఖ్యానం, వివరణా అవసరం నేను, సుమారు ఏడెనిమిదేళ్ల నుండీ, విశాఖపట్నంలో షిప్‌యార్డులో పని చేస్తున్నాను మా తలితండ్రులకు నే నొక్కణ్ణే సంతానం నాకు అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్లూ ఎవరూ లేరు పైగా మా నాన్నగారు మా స్వగ్రామమైన నూజివీడులో మా తల్లిగారితో సహా ఉండడంవల్ల ఇక్కడ విశాఖపట్టణంలో, నేనూ మా శ్రీమతీ మాత్రమే ఉంటున్నాం మా ఇంట్లో మూడో మెంబరు, ఇన్నేళ్లబట్టీ కూడా ప్రవేశించలేదు

ఎప్పుడోగాని సాధారణంగా మా యింటికి బంధువు లొచ్చేవారు కాదు ఈ వూర్లోనే గిరిజ అక్క శారద ఉంది శారద భర్తకు ప్లీడరు గుమాస్తా పని శారద ఆయన మూడో భార్య శారద తలిదండ్రులకు, నలుగురు ఆడపిల్లలూ, ముగ్గురు మగపిల్లలూ, పెద్దవాడు సరిగా చదువబ్బక రోడ్డు గుమాస్తా పనిచేస్తూ నెలకు అరవై రూపాయలు తెస్తున్నాడు శ్రీకాకుళం దగ్గర ఒక పల్లెటూరులో ఆ కుటుంబాని కదే ఆధారం శారదకు ఇరవైయేళ్లు వచ్చాక, కట్నాలు పోసి మంచి సంబంధాలు తేలేక, ఎలాగో ఒకలాగ పెళ్లయిందనిపిస్తే చాలునని, విశాఖపట్నంలో సుమారు నలభై అయిదేళ్లు వయసు గలిగి, అంతకుముందు రెండు వివాహాలై కళత్రద్వయాన్ని కోల్పోయి, ఆరుగురు సంతానం కలిగిన గోపాలరావుగారి కిచ్చి పెళ్లి చేశారు. గోపాలరావుగా రిల్లు మేమున్న వీధిలోనే. అందువల్ల శారదకూ మా ఆవిడకూ పరిచయం వృద్ధయి, అదివరకు మాలో మాకు రాకపోక లెక్కువ లేకపోయినా, క్రమంగా అవి ఎక్కువయ్యాయి

అప్పటికి శారదకు పెళ్లయి నాలుగేళ్లయింది. గిరిజకు పదహారేళ్లు దాటడంవల్ల, దాని పెళ్లి గురించి వాళ్ల వాళ్లు తొందరపడ నారంభించారు. ఆ సందర్భంలో మా పెత్తల్లి, శారద వద్దకు రావడం, క్రమంగా మా ఆవిడతో పెళ్లి విషయాలు మాట్లాడడం మొదలెట్టి చివరకు మామీద కొంత బాధ్యత నుంచింది

విశాఖపట్టణంలోనే ఒక సంబంధం గురించి వాళ్లు ప్రయత్నించారు పిల్లవాడు ఇంటర్ తప్పాడు రైల్వేలో గుమాస్తాగా చేరాడు అతనికి గిరిజ నచ్చింది కాని వాళ్ల వాళ్లకి మూడువేల కట్నం కావాల్రి అదివ్వలేక మా పెత్తల్లి ఆ సంబంధం వదులుకుంది రైల్వేలో నూరు రూపాయలు తెచ్చుకుంటున్నాడు, పాతికేళ్ల లోపువాడు, గిరిజ కీడైనవాడు ఈ సంబంధం కుదిరితే ఎంతో బాగుండు ననుకొంది మా పెత్తల్లి, కానీ ఏం లాభం ! మూడువేలు కట్నం ఎక్కడనుంచి తేగలరు. అధమం మూడు వందలైనా ఇవ్వగల పరిస్థితిలో లేరు మనసులో ఆవిడ ఎంతో కొట్టుకుపోయింది. క్రియ చెయ్యలేనప్పుడు అది తీరని బాదే ఆవిడ బాధ చూసి కొంత సానుభూతి చూపించింది. మా శ్రీమతి "పోన్లే అత్తయ్యా ఈ సంబంధం తప్పిపోయిందని విచారించకండి మరోదానికోసం ప్రయత్నిద్దాం అందరూ కట్నాల పట్టింపుతో కూచోరు పిల్ల చక్కనిది దాని చక్కదనం నచ్చినవాళ్లెవరో దాన్ని చేసుకుంటారు నేను కూడా ఆ దృష్టిలోనే ఉండి వాకబు చేస్తాను" అంది

దానికి మా పెత్తల్లి "నిజమే కమలా నే ననకూడదు గాని, గిరిజ చాలా చక్కని పిల్ల. చిన్నప్పుడు దా న్నందరూ అప్సరస అనేవారు ఈ వయసులో సరియైన పోషణలేక పిల్ల అలా ఎండిపోయింది మా యింట్లో దానికేం పోషణ ఉంటుంది చెప్పు శుభ్రమైన నెయ్యి లేదు పాలూ, పెరుగూ అసలే లేవు ఒక ఏడాది మీ యింట్లో ఉందంటే ఎంత బాగానైనా తయారవుతుంది పోనీ నీకు సాయంగా ఉంటుంది వాల్రోజులు మీ యింట్లో ఉంచుకోకూడదుటే ?" అని నోరు విడిచి అడిగింది

"అయ్యో ! తప్పకుండాను "

"గిరిజ పెళ్లి మీ చేతుల మీదుగా జరగాలని నా కోరిక. నీ మనస్సు చాలా మంచిదమ్మా చిన్నపిల్లవైనా నీకున్న బుద్ధి ఎవరికీ లేదు గిరిజ నీ పిల్లే ననుకో దాని మంచి చెడ్డలు ఇహ మీవే" అని మా పెత్తల్లి, మా కమల మనస్సును బాగా పొగిడి, గిరిజ మా యింట్లో ఉండడానికి ఏర్పాటు చేసింది

సహజంగా స్త్రీ హృదయంలో, వేరొక స్త్రీ వివాహ విషయంలో బాధపడుతూవుంటే చూడలేకపోవడం వలననో, లేక అంతగా నోరు విడిచి అడిగిన మా పెత్తల్లి మాటలు తోసివేయలేకనో, తను ఒకరి జీవితాన్ని సరిదిద్దా ననిపించుకోవడంలో ఉండే గొప్పతనంయందు వాంఛ వలననో మా

44 వ పేజీ చూడండి



**రచన: 'రమ'**

గదిలోంచి పసిపాప ఏడుపు వినిపించింది అంత వరకూ వినిపిస్తున్న మూలుగులు ఆగిపోయాయి ఒకటే ప్రశ్నలు, గందరగోళం.

"ఏం పిల్ల ?"

"ఆడపిల్ల"

"ఆడపిల్లా ! అయ్యో ! ఇంకేం రామకృష్ణా! ఇవాళనుంచే డబ్బు కూడబెట్టు"

"అయ్యో ! మనవడు పుడతాడు తాతగారి పేరు పెడదాం అనుకున్నాను అంత అదృష్టమా!"

ఈ దీవనలన్నీ మవునంగా అందుకుంటూ ఆడపిల్ల జీవితం ప్రారంభిస్తుంది ఆమెను ఎవరూ రమ్మని కోరలేదు యీ లోకంలోకి పైగా ఆమె రాక అందరినీ విచారంలో ముంచింది నిట్టూర్పుల మధ్య పెరుగుతుంది అమ్మాయి ఆమెని ఎవరూ ఎక్కువగా అభిమానించరు బరువుగా తీర్చవలసిన అప్పుగా దండుగ ఖర్చుగా భావిస్తారు, అన్నీ తెలిసినా ఏమీ చేయులేదు కనుక, ఏమీ ఎరగనట్లు రోజులు గడుపుతుంది బాలిక

స్త్రీ జీవితాన్ని ముఖ్యంగా మూడు దశలలో చూడవచ్చు ముగ్ధ బాలికగా, బాధ్యత ఎరిగిన భార్యగా, మాతృదేవతగా చూస్తాము. మొదటి దశలో పుత్రికగా, సోదరిగా తన బాధ్యతలు స్వీకరిస్తుంది తరువాత అర్ధాంగిగా, జీవితాంతంవరకూ పతి కష్ట సుఖాలు పంచుకుని జీవితనౌక యీదే యిల్లాలుగా కనిపిస్తుంది చివరి దశలో తను జన్మ యిచ్చిన బిడ్డలకోసం వాళ్ళ భవిష్యత్తు కోసం తాపత్రయపడే తల్లిగా కనుపిస్తుంది. స్త్రీ విశాల హృదయ తల్లిదండ్రులకి, అన్నదమ్ములకి, అక్కచెల్లెళ్ళకి, భర్తకి, బిడ్డలకి — అందరికీ తన ప్రేమ పంచి యివ్వగలదు ఆమె. ఆమె ప్రేమలో ఎక్కువ తక్కువలకి, అసూయ ద్వేషాలకి తావు లేదు

"అమ్మా ! నేను సర్కసుకి వెడుతున్నాను పాప కూడ వస్తానంటోందమ్మా !" అంటాడు చిన్న సీను అమ్మ పాపవైపు చూస్తుంది పాప దీనంగా చూస్తోంది అన్నతో సర్కసుకి వెళ్ళాలని ఎంత ఆతృత పడుతోందో ఆ పసిదాని ముఖమే చెబుతూంది అమ్మకి జాలేసింది "పోనీ, దానిని కూడ తీసుకువెళ్ళకూడదురా. నువ్వేం ఎత్తుకు తీసుకవెళ్ళాలా ? నీ వెనకాలే వస్తుంది" అంటుంది అమ్మ. పాప ముఖంలోకి ప్రకాశం వచ్చింది "వద్దమ్మా ఎక్కడయినా అమ్మాయిలని తీసుకు వెడతారేవిటి ? అయినా మా ఫ్రెండ్‌లు ఎవరూ తీసుకురావడంలేదు చెల్లెళ్ళని. నేను తీసుకవెడితే అందరూ నవ్వుతారు" అంటూ సమాధానం కోసం ఎదురుచూడకుండా పరుగు పెట్టాడు సీను ఏడుస్తూ అన్న వెంట పడబోయిన పాపని పట్టుకుని "మనం రేపు వెడదాములే నాన్నగారితో కలిసి ఛీ ఏడవకూడదమ్మా రేపు వెడతాంగా. వెళ్ళి సరోజని పిలుచుకురా లడ్డు యిస్తాను ఆడుకుందురుగాని" అంటూ సముదాయిస్తుంది అమ్మ — ఇలాగే ప్రతీ ఇంట్లోనూ చిన్నప్పటినుంచీ స్త్రీ, పురుష భేదం బాగ గుర్తిస్తారు అమ్మాయిని, అబ్బాయిని ఒక్కలాగ చూడరు. అబ్బాయి అనేసరికి పెద్ద మాట తెస్తాడు, మనలని ఉద్ధరిస్తాడు, వగైరా ఆలోచనలు వస్తాయి దాంతో అబ్బాయికి ఇంట్లో ప్రాముఖ్యము పెరుగుతుంది అమ్మాయి మొదటినుంచీ బరువే అమ్మాయి పెద్దదవుతుంటే పాపం పెరుగుతున్నట్లూ, అప్పు పెరుగుతున్నట్లూ ఉంటుంది తల్లిదండ్రులకి సరే, కొంత వయస్సు వచ్చేసరికి అబ్బాయికి కూడ అర్థమవుతుంది తను చెల్లెలికంటె 'గొప్పవాడన్న' సంగతి అబ్బాయి, అమ్మాయి ఇద్దరూ సమానంగా చదువుకుంటున్నా, పెద్దవారు ఇద్దరినీ సమానంగా చూడరు అబ్బాయి కూడ చెల్లెలు, అక్క తనతో సమానమని అనుకోలేడు చిన్నప్పుడు మనస్సులో నాటుకున్న యీ 'అభావం' వయస్సుతోపాటు పెద్దదై, స్థిరమై తిష్ట వేసుకుని కూర్చుంటుంది అబ్బాయి మనసులో "ఆ, ఆడది !" అన్న నిర్లక్ష్యభావం మాత్రమే అతనిలో మిగులుతుంది తమకి అన్నీ అమర్చి పెట్టడానికి, అమ్మకి సాయం చేయడానికి నాన్నగారు వదిలించుకునేంతవరకూ ఇంట్లో ఉండడానికి—ఇదీ అబ్బాయి దృష్టిలో అమ్మాయి ఉపయోగం జీవితంలో అమ్మాయి ఆదర్శం కూడ ఇదేనని అబ్బాయి భావం బహుశ అమ్మాయిల ప్రవర్తనే అబ్బాయిలలో యీ భావం కలిగించడానికి కారణం అనుకుంటాను కాని బాలికలలో ఇంత హీనమైన భావాలకి తావులేదు తన అన్న, తన తమ్ముడు, వీళ్ళు తనవాళ్ళు అన్న భావం పెరుగుతుంది ఆమెలో. వాళ్ళ బాధ్యతలు తనమీద వేసుకుని, వాళ్ళ మంచి చెడ్డలు చూస్తుంది ఈ పనులలో ఆమె అలసిపోదు పైగా ఒక విధమైన ఆనందం అనుభవిస్తుంది ఎంత చదువుకున్న అమ్మాయి కయినా తన యింట్లో తను నిర్వహించవలసిన విధులు ఉంటాయి

అమ్మాయిలకి తన అన్నదమ్ములతో సినిమాలకి, షికార్లకి వెళ్ళాలనుంటుంది. కాని అబ్బాయిలకి అక్కచెల్లెళ్ళతో ఎక్కడికయినా వెళ్ళడానికి యిష్టంగా ఉండదు చిన్నతనంగా భావిస్తారు అమ్మాయికి ఇది తీరని కోరికే చిన్నప్పుడు అమ్మ బుజ్జగింపుతోను, పెద్దయ్యాక గుడ్ల నీరు కుక్కుకుంటూనూ అణచుకోవలసిన కోరిక !

చాలమంది అబ్బాయిలకి ఆడపిల్లల చదువు మీద సదభిప్రాయం ఉండదు అసలు అమ్మాయి ఇంట్లో ఉండడమే దండుగ దీనికి తోడుగా చదువంటూ ఇంకా డబ్బు ఖర్చెందుకూ అని ఉంటుంది వీరికి. ఇంకా లోగుట్టు ఏమిటంటే అమ్మాయిలు స్వతహాగా చురుకైనవారు దానికి తోడుగా తమ బాధ్యతను గుర్తించి కష్టపడి చదువుతారు. అబ్బాయిలకి దానితో మరీ చిక్కు వస్తుంది తన కంటె చిన్నవాళ్ళు తన క్లాసులోకి వచ్చేయడం, లేదా తనకంటె పై క్లాసులోకి వెళ్ళడం జరుగుతుంది. దీనితో తలెత్తుకోలేని పరిస్థితి అబ్బాయికి. తను ఇంతవరకూ క్లాస్‌లో చేసే నవకృష్ణ లీలలు ఇంటికి చేరేస్తుందేమోనని భయం. అందుకే ఆడపిల్లలకి చదువు అనవసరం అంటారు అబ్బాయిలు

కాలేజీ చదువులతో అమ్మాయిలకి యిబ్బందులు కూడ పెరుగుతాయి ఎవరితో ఎక్కువ మాట్లాడకుండా తన చదువు గొడవ చూసుకుంటూ ఉంటే ఎక్కడో బి సి లో ఉండవలసిన దంటారు. కాస్త తెలివైనదయితే గర్వమంటారు అలాగ కాక కాస్త చలాకీగా, కలుపుగోలుతనంగా ఉందంటే ఆమె పేరు ఇతర పేర్లతో జోడించబడి బ్లాక్ బోర్డుల మీదికి, కాలేజీ గోడల మీదికి ఎక్కుతుంది అమ్మ, నాన్న పెట్టిన పేరు చాలదేమోనని మగవారు "ప్రేమతో" అమ్మాయిలకి యిచ్చే బిరుదులకి లెక్కలేదు ఇవన్నీ ఇంట్లో తెలిస్తే అమ్మాయి చదువుకి తిలోదకాలు ! అవసరం వచ్చినప్పుడు, ఒక్కరే ఉన్నప్పుడూ ఎంతో మర్యాదగా మాట్లాడతారు మగవారు చాటుకి వెళ్ళి మళ్ళీ ఆక్షేపణలు

ఎలాగో విద్యార్థిదశ దాటుతుంది. ఇక వివాహం. దీనికి జరిగే హంగామా అంతా యింతా కాదు. గొడవ, గందరగోళం జరగకుండా జరిగే వివాహాలు చాల తక్కువ స్త్రీ జీవితంలో ఒక పెద్ద శాపం పెళ్ళిచూపులనే తతంగం పదిమంది ముందూ ఒక యువతిని నడిపించడం, చదివించడం, పాడించడం లాంటి శల్య పరీక్షలు చేయడం ఎంత అవమానం ! తండ్రి, అన్నదమ్ములూ ఉన్నా గుడ్లు తేలేసి చూడడం తప్ప ఇంకేం చేయరు రేపు తామూ యిదే పద్ధతిని కన్యని ఎన్నుకోవాలి కనుక సోదరుల హృదయం బాధగా మూలగదు ఈ దారుణ కాండకి దుకాణంలో వస్తువుని చూసి బేరమాడినట్లు ఎంతమంది వచ్చి చూడాలో, ఎన్ని వంకలు పెట్టించుకోవాలో ! అమ్మాయి వచ్చినా, అంతకంటె ముఖ్యమయిన బేరం విషయం తేలవద్దూ ! చేతిలో నిండుగా రూపాయలు పడితే అమ్మాయినయినా, బొమ్మ నయినా కట్టుకుందుకు సిద్ధం!

ముక్కూ ముఖం ఎరుగని తనని కట్టుకుని జీవితాంతం వరకూ కష్టసుఖాలు పంచుకునేందుకు (చివరికి పంచుకునేది మొదటిది మాత్రమే!) సిద్ధపడుతూందే ఈ యువతి, తననేం పరీక్షలు చేయలేదే మరి తను కూడ యిలాంటి నీచమైన పరీక్షలు మాని ఆమెని చేపట్టి తర్వాత ఆమె లోపాలను (ఉంటే) సర్దుకుపోవడానికి లేదా సరిదిద్దుకునేందుకు ఎందుకు ప్రయత్నించకూడదూ యువకులు! అట్లా ఒక్కరూ చేయరు వాకేం లేను మగవాడిని లోపాలున్న వాళ్ళను చేసుకో వలసిన కర్మం పట్టింది నాకు? ఇదీ! మగవారి గర్వం

పదిమంది ముందూ పెళ్లిచూపులు పేరుతో శల్యపరీక్షలు చేసి నా ఖరీదు ఇంత అని సిగ్గు విడిచి చెప్పి ఆడపిల్లను కన్న తల్లిదండ్రుల కష్టం సుఖం ఆలోచించకుండా అంతా ఆఖరిపైస వరకూ పీడించి తీసుకున్న యువకుడు తాళి కట్టిన మర్నాడు అన్నీ మరచి భార్యని దగ్గరకు తీసుకుంటే యువతి అతని తప్పులన్నీ క్షమించి అతనిలో ఐక్యమయిపోవడం సాధ్యమా? సాధ్యమే ప్రతీ యువతి జీవితంలోనూ జరుగుతున్న విషయమే అది అతడు తనలో చూపిన వంకలూ ఇంత కట్నం యివ్వడానికి తండ్రి పడ్డ అవస్థా అంతా మరచిపోయి ఇదంతా అతి సామాన్య విషయంగా భావించి పతిదేవుని ఆరాధిస్తుంది స్త్రీ క్షమా హృదయ కదా మరి!

పెళ్లయిన తరువాత స్త్రీ జీవితం మరీ నరకంగా తయారవుతుంది తన మగతనపు హోదా అంతా భార్యమీద చూపిస్తాడు భర్త అన్నిటికీ ఆంక్షలు కూర్చునేందుకు నుంచునేందుకు ఎవరితోనైనా మాట్లాడేందుకు కూడ భర్తగారి అనుమతి సినిమాలు షికార్లు సంగతి కలలో కూడ తలుచుకో నక్కరలేదు భర్త చక్కగా ప్రతి సినిమాకి ఇష్టమయిన చోట్లకి తిరిగి వస్తాడు రాత్రి 12 అయినా 2 అయినా కనిపెట్టుకుని చూసే ఇల్లా లుందిగా! అతని సరదాలు తీరాలి కాని ఆమె సరదాలు తీరాలన్న బాధ అతని కెందుకుంటుంది! కొంతమంది దయామయులు కనికరించి పక్కఇంటి వాళ్లతో వెళ్లమంటారు కొంతమంది అదీ అనరు! ఇంత చేసినా స్త్రీ సహిస్తుంది తన కోరికలు సరదాలు తీరకపోయినా సర్దుకుంటుంది భర్తకి అన్నీ అమర్చిపెట్టి అతని సుఖ సంతోషాలకోసం ఎంతైనా బాధపడుతుంది ఆమె భర్త గురించి కోరేది ఆశించేది సానుభూతి ప్రేమతో కూడిన చల్లని మాటతో ఆమె శ్రమనంతా మరచిపోగలదు ఆ ఒక్కమాట కూడ లభించకపోతే ఆమె జీవితం దుర్భరం కాదూ!

వాళ్లతో మాట్లాడావని వీళ్లని చూశావని అనుమానిస్తూ భార్యలను రాక్షసుల మాదిరి హింసించే భర్తలున్నారు ఎన్ని బాధలయినా అనుభవించవచ్చు కాని భర్త అనుమానించడం కన్న అవమానం నరకం యింకేం ఉంది స్త్రీకి!

యువతిగా తన జీవితంలో ప్రవేశించబోయే వ్యక్తి గురించి ఎన్ని కలలు కంటుంది ముందు జీవితం ఆనందమయం కాగలదని ఆశిస్తుంది అది తీరకపోతే పుట్టిన బిడ్డల మీద ఆశ పెట్టుకుని బతుకుతుంది మన ప్రస్తుత సాంఘిక పరిస్థితుల దృష్ట్యా ఆలోచిస్తే ఎన్ని కష్టాలు పడ్డా భర్తకంటే ముందుగా చనిపోవడమే భార్య అదృష్టం సౌశ పుణ్యాల మాట దేవు డెరుగ కాని భర్తృహీన అయిన స్త్రీ పాట్లు మనకు తెలిసినవే కదా! ఇంటా బయటా కూడ గౌరవం ఉండదు జన్మ యిచ్చిన తల్లిదండ్రులూ కట్టుకున్న భర్తే ఆదరించనినాడు సుపుత్రులు మాత్రం ఆదరిస్తారా? భర్త ఉన్నంతవరకూ ఎంత హీనంగా బతికినా నాలుగు గోడల మధ్య గడచిన జీవితం పుత్రుల హయాంలోకి వచ్చాక వీధిలోకి వచ్చి పడుతుంది నవ మాసాలు మోసి కని వాళ్లకేదయినా అయితే అహోరాత్రులు కనిపెట్టుకుని కాపాడి పెంచిన అమ్మలని నీకు తెలియదమ్మా వూరుకో' అని తీసిపారేసే అబ్బాయిలని మనం చూస్తున్నాం కాని భర్త కంటె ముందు మరణించడం అన్నది మన చేతులలో లేని విషయం కదా!

ఆడదై పుట్టడం కంటె అడవిలో మానై పుట్టటం మేలు అన్న సామెతే అక్షరాల నిజమై కూర్చుంది మనవాట్ల!

స్త్రీని గౌరవించాలన్న సంస్కృతి చదువు నేర్పదు మనిషి మనసులోంచి రావలసినదే కాని సంస్కృతి ఎవరూ నేర్పితే వచ్చేది కాదు ఒకప్పుడు స్త్రీ దేవత అని స్త్రీ ఇంట్లో ఉండడం శుభలక్షణమని కలకంఠి కంట కన్నీ రొలికిన అశుభమని భావించి స్త్రీని గౌరవించిన మన భారతదేశంలో ఈనాడు స్త్రీ పాట్లు వర్ణనాతీతం నేనాడి స్త్రీల కన్నీటి వరదలు ఈ పురుషుల్ని కదిలించలేకపోతున్నాయి

స్త్రీ సమస్యగా పుడుతుంది సమస్యగా పెరుగుతుంది సమస్యగానే మరణిస్తుంది స్త్రీ జీవితమే ఒక సమస్య ★

---

గతవారం 29 వ పేజీలోని శర్కరాయణం' వ్యాసం ప్రారంభంలో బ్రాకెట్‌లమధ్య ఉన్న మూడవ పేరాలోని వాక్యం ఉండవలసినది కాదు పాఠకులకు కలిగిన ఈ ఇబ్బందికి చింతిస్తున్నాము



భర్త కోటుకి గుండీ కుడుతున్న అమెరికా రాయబారి శ్రీ బౌల్స్ సతీమణి

# వనితా వాణి

## వ్యక్తిత్వం

"రచయిత్రి, వ్యక్తిత్వం గూర్చి బాగానే వ్రాశారు కాని వ్యక్తి తాను చేయబూనిన పనిని ఆప్తులతో చెప్పుటలో వ్యక్తిత్వానికి లోటు ఉంటుందన్నట్లు సూచించారు అలా ఎప్పటికీ వ్యక్తి తన వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోలేడు పైగా తాను నిర్వర్తించగల పనికి యితరుల ఆదేశానుసారంగా ఆగిపోడు కాని వారిని ఒప్పించి, మెప్పించి మరీ ఆపని పూర్తిచేసి తీరుతాడు అప్పుడూ తనకూ పూర్తి సంతృప్తి లభిస్తుంది తను తృప్తి పొందినప్పుడే తన వ్యక్తిత్వానికి లోటు లేదని భావించగలడు కాని ఎదుటవారిని తృప్తి చేయకుండా తాను తృప్తి పొందలేడేమో ? ఉదాహరణకు వ్యాసంలోని కమల గారు అన్న మాటనే తీసుకోండి వాళ్ళేం మిమ్మల్ని కొట్టేస్తారా ? చంపేస్తారా ? అడిగి చేసుకొనే కంటే మానేయడం ఉత్తమం" అంటే మానేయడంలో వ్యక్తిత్వానికి హాటు లేదంట రా ?

ఎం సరసి (హోర్డ్డ కండ్లా)

*　　*　　*

'వ్యక్తిత్వం' వ్యాస రచయిత "శ్రీ రాధా రామవ్" గారి కలంలో అక్కడక్కడ ఆవేశం ఎక్కువ పాలలో ఉన్నట్లు కనబడుతుంది అయినప్పటికి నేటి పరిస్థితులలో వారి వ్యాసం వాస్తవానికి దగ్గరగానే యున్నది ఇది చదివైనా అలాంటి వ్యక్తులు తమ స్వంత శక్తిమీద ఆధారపడగలరని భావించవచ్చు ననుకుంటా

అం శ్రీ (వట్టెమర్తి)

*　　*　　*

రచయిత్రిగారు అన్నట్లు పెద్దవారు మనిషి యొక్క వ్యక్తిత్వమును చిన్నచూపు చూడకూడదు సరికదా, ఆ మనిషియొక్క అభిప్రాయాలు, అభిరుచులు, అవనీతి, హాస్యాస్పదం (సమాజపు దృష్టిలో) గా గోచరించిన పెద్దవారు మందలించటము వారి కర్తవ్యం

కె గోపాల్ సరోజ (జగ్గయ్యపేట)

*　　*　　*

వ్యాసం నిజంగా నిత్య జీవితంలో జరిగే సంఘటనలు వాస్తవానికి దగ్గరగా ఉన్న ఈ శీర్షిక ప్రతికలో ప్రచురితమైనందుకు మేము ఎంతో సంతోషిస్తున్నాము వ్యక్తిత్వంలేని వ్యక్తులకు మంచి గుణపాఠం

వెంపాడ రవణమ్మ, వెంపాడ మాకరత్నం (కాకినాడ)

*　　*　　*

వ్యాసం ఏమంత సమంజసముగా లేదు ఏ ఒక్కరిద్దరినో దృష్టిలో ఉంచుకొని, ఈ వ్యాసం వ్రాశారు కాని నిజానికి ఇటువంటివారు చాలా తక్కువ ఉంటారు

కే శ్యామలాదేవి, ప్రేమలత (కరీంనగరము)

## అబద్ధాలు

కొందరు తను ఇంటిని గురించి అందరికి తెలిసినా లేనిపోని గొప్పలు చెప్పుతారు అటువంటివారిని చూస్తే అసహ్యం కలుగుతుంది కానీ ఒక్కొక్క సమయంలో అబద్ధము చెప్పటము ఎంతో అవసరము వస్తుంది అటువంటి సమయములలో తప్పకుండా అబద్ధము ఆడాలి మొత్తానికి వ్యాసం బావుంది

కుమారి ప్రసూన, కుమారి లక్ష్మి (పెసరమిల్లి)

☆

## చదువలావ - బి. వి. సత్యమూర్తి



'అయ్యో, అయ్యో! రైలు కూతకూసింది కదిలిపోతుందో ఏమిటో సామాన్లన్నీ దిగాయా దిగండర్రా తొందరగా అలా చూస్తారేమండీ, ఆ కిటికీలో నుంచి పెట్టెలు అందిస్తున్నారు! అందుకోండి!'

భార్య హడావుడి గమనించిన వీరయ్యగారు కూడ రైల్లో జనం వెనకాలే ఉండిపోయి దిగలేక సతమత మవుతున్న వాళ్లని తొందర చేశారు

'మగ పెళ్ళివార మయితిమి! ఇంకా దిగాల్సిన వాళ్ళున్నారు, ఓ క్షణం ఆపమని గార్డుతో చెప్పండి!

భార్య అమాయకత్వానికి విసుక్కున్నారు వీరయ్యగారు

వీళ్ళ అవస్థ చూచి నలుగురూ సాయం పట్టి సామానంతా కిందకు దించారు రైలు వెళ్ళిపోయింది

'సామాన్లన్నీ లెక్కపెట్టండ్రా, అన్నీ వచ్చాయో లేదో!'

'అన్నీ దిగిపోయినయిలేవమ్మా! నువ్వూరుకో ఏం కంగారుపడకు' అని పెళ్ళి పెద్ద ధైర్యం చెప్పాడు పెళ్ళికుమారుడు, తల్లి అయిన జానకమ్మగారికి

మొత్తం పాతిక ముప్ఫయి మంది దాకా దిగారు పెట్టెలూ, బెడ్డింగులూ, చేతి సంచులూ, బుట్టలూ, మర చెంబులూ ప్లాట్ ఫారం మీద పరిచేశారు కొందరప్పుడే నీరసంతో కనబడ్డ పెట్టెలమీద బెడ్డింగుల మీద కూచున్నారు ఉసూరుమని

"ఇప్పటికి రైలు ప్రయాణమయింది ఇక బండి ప్రయాణం మిగిలి ఉంది" అని చేయబోతున్న ప్రయాణాన్ని గురించి బెంగ పెట్టుకున్నాడు పెళ్ళికొడుకు స్నేహితుడు, అతి సుకుమారుడు అయిన కుశాలరావు

"ఇదేం స్టేషను బాబూ! కాఫీ నీళ్ళైనా లేవు" ఒక నాజూకయిన అమ్మాయి ముదురు



చేత్తో పట్టుకుని బాధ పడింది

పెళ్ళికొడుకు శంకరం మరొక స్నేహితునితో కబుర్లల్లో మునిగిపోయాడు

జానకమ్మగారు మాత్రం వళ్ళంతా కళ్ళు జేసుకుని నాలుగు వేపులా పారజూసుకుంది పాపా వంతా దిగినట్టే !

ఉన్నట్టుండి ఆమెకు అనుమానం కలిగింది

'ఏమండీ! మన పెట్టె ఏదీ ! అందులో పెళ్ళి కూతురికని చేయించిన నగలూ— బట్టలూ అవీ ఉన్నాయండీ! ' అన్నది కంగారుగా

'అన్నీ ఉన్నాయి నువ్వు నోరు మూసుకో అదుగో ఆ పరుపు చుట్ట కింద ఉంది ఆ పెట్టె సరేనా !'

'హమ్మయ్య ! గుండె బేజారయిపోయింది గదండీ ! బోలెడన్ని నగలూ బట్టలూనూ మరి ' అని కుదటపరుచుకుని ఎందుకో మళ్ళీ సందేహం వచ్చి చుట్టూ చూసింది

'ఏమండోయ్ ! కొంప మునిగింది అత్త గారు కనబడరేం !'

ఆ మాటకు వీరయ్యగారు ఆదుర్దాగా అటూ ఇటూ చూశారు

'అయితే మా అమ్మ రైల్లో నుంచి దిగలేదన్న మాట !'

ఏమి చేమిటని పలుగురూ మూగారు

'పాపం ముసలావిడ గూడాను. ఏమి అవస్థ పడుతుందో ఏమిటో !'

'పక్క స్టేషనులో నయినా దిగుతుందో లేదో!'

'అంతా ఎవరిమటుకు వాళ్ళు చక్కా దిగి వచ్చేశారు ఆ ముసిలిదాన్ని వదిలేసి ' అని వీరయ్య గారు చిందులెయ్యడం చూసి జానకమ్మగారికి కళ్ళ నీళ్ళ పర్యంత మయింది

'పాపిష్టిదాన్ని హడావుడి, పయిగా జనం వత్తిడి వీటితో ఆవిడ మాటే జ్ఞాపకం లేక పోయింది '

'ఇప్పుడయినా మించిపోయిందిలేదు పక్క స్టేషనుకు ఫోను చేయించండి ఆవిడ ఎలా ఉండేదీ ఏ పెట్టెలో ఎక్కిందీ చెబితే జాగ్రత్తగా దింపుతారు

వీరయ్యగారు ఆలస్యం చెయ్యకుండ స్టేషను మేష్టరు రూములోకి పరిగెత్తికెళ్ళి ఆయన్ని ప్రాధేయపడ్డాడు

'స్టేషను మేష్టరు ఇంతెత్తున ఎగిరి పడ్డాడు ఇంత సేపటినుంచీ ఏం జేస్తున్నారండీ మరీ ! రైలు పక్క స్టేషనుకూడా దాటి వెళ్ళిపోతేనూ!'

వీరయ్యగారు బిక్క చచ్చిపోయి వెనక్కు వస్తుండగా — వీళ్ళవస్థంతా ఇందాకటి నుంచీ గమనిస్తున్న ఒకాయన అడ్డు తగిలాడు

'మీరేం భయపడకండి ! మీ అమ్మగారిని తీసుకు వచ్చి అప్పగించే భారం నాది ఇంతకూ మీరంతా ఎక్కడికి వెళ్ళాలి' అని అడిగాడా కొత్త వ్యక్తి

అప్పటిదాకా వాళ్ళకు తట్టనేలేదు తమకోసం ఆడ పెళ్ళివారెవరూ కూడా స్టేషనుకు రాలేదని !'

వీరయ్యగారు ఆ కొత్త వ్యక్తికి చెప్పారు

'కొత్తపాలెం వీరభద్రయ్య గారింటికి వెళ్ళా లండీ ! రాత్రికి తొమ్మిది గంటల ఇరువది నిము షాలకు ముహూర్తం స్టేషనుకు బండ్లు పంపిస్తా మని చెప్పారు మరి ఇంతవరకూ ఎవరూ వచ్చిన జాడలేదు ! ఇవ్వన్నీ ఇట్లా ఉండగా ఈ ముసలమ్మ గొడవ ఒకటి వచ్చిపడింది '

కొత్త వ్యక్తి కోటు జేబులోంచి సిగరెట్టు తీసుకుని లైటరుతో వెలిగించుకున్నాడు

'ముసలమ్మగారి విషయం మీరు నిశ్చింతగా ఉండండి ఆమెను క్షేమంగా మీకు వప్పగించే బాధ్యత నాది ఇంతకూ వీరభద్రయ్యగారి సంబంధం మన్నమాట మీరు చేసుకోబోయేది !'

'అవును బాబూ ! మీకు బాగా తెలుసా ఆయన'

'అబ్బే ! తెలిసే దేముంది ఆయన మాకు బంధువు నేను కూడ ఆ పెళ్ళికే వెళ్తున్నాను '

'అలాగా ! చాలా సంతోషం !'

కొత్త వ్యక్తి స్టేషను మేష్టరు గదిలోకి వెళ్ళి అయిదు నిమిషాల్లో తిరిగివచ్చి వీరయ్య గారిని కలుసుకుందామని చూస్తే ఆయన అప్పటికే భార్యతో చెప్పి స్టేషను బయటకు వెళ్ళాడు

38 వ పేజీ చూడండి





# కొలంబా

## రచన: ప్రాస్పర్ మెరిమె

### జరిగిన కథ

కర్నల్ థామస్‌నెవిల్, తన కుమార్తె లిడియాతో ఇటలీ యాత్రానంతరం ఫ్రాన్స్ వస్తాడు. లిడియా సాహసం గల యువతి. చిత్రలేఖనం తెలుసు 'కార్సికా' ఫ్రాన్సు ఇటలీల దరిని గల ద్వీపం అక్కడికి వెళ్లడం కష్టనష్టాలతో కూడిన పని ఐనా లిడియా, నెవిల్‌లు నావ కాప్టెన్ మాతెతో ప్రయాణం అవుతారు. కార్సికాకు బయలుదేరారు. వారితో లెఫ్టినెంట్ "ఆర్సొదెల్లా రెబ్బియా'' అనే కార్సికను కూడా వచ్చాడు. కర్నల్‌కి రానురాను యీ రెబ్బియాతో పరిచయం పెరుగుతుంది మూడు రోజుల ప్రయాణం తర్వాత వారి నౌక అజాచ్చియో గల్ఫ్ సమీపించింది వారు కార్సికా చేరారు పాస్‌పోర్టు ఆఫీసరు మాటలవల్ల, ఆర్సో తండ్రి హత్యకు లోనయ్యాడని మిస్ లిడియా గ్రహిస్తుంది. ఇంతలో ఆర్సో చెల్లెలు కొలంబా అతన్ని వెతుక్కుంటూ అజాచ్చియోకి వస్తుంది. కర్నల్‌గారి సత్రంలోనే దిగుతుంది. రచయిత, ఆర్సో తండ్రి హత్యకి సంబంధించిన వివరాలు చెప్తాడు. బారిచిని అనేవంశంతో దెల్లా రెబ్బియా వంశానికి వైరం ఉంటుంది.

కొలంబాతో పియత్రనెరాకి వెళ్లిపోయే ముందు ఆర్సో కర్నల్‌గారినీ, మిస్ లిడియానీ కూడా అక్కడికి రమ్మని కోరుతాడు ఆర్సోతో ఎడబాటుకి మిస్ లిడియా చలిస్తుంది.

ఆర్సో, తన చెల్లెలితో ముందుకు సాగిపోయాడు. గుర్రాల వేగానికి, మొదట, మొదట మాట్లాడటం కష్టంగా ఉన్నప్పటికీ క్రమంగా వారు కొండప్రదేశాల మీదుగా వెళ్లటంచేత తమ క్రొత్త స్నేహితులను గురించి చర్చించే అవకాశం కలిగింది. మిస్ నెవిల్ అందం, ఆమె బంగారు రంగుజుట్టూ, సంస్కారమూ గురించి ఉత్సాహంగా మాట్లాడింది కొలంబా. కర్నల్ గారు కనిపించినంత ధనవంతుడేనా, మిస్ లిడియా ఆయన ఏకైక పుత్రికేనా, అని అడిగింది. "ఆమె తండ్రికి మనమంటే అభిమానం లేకపోలేదు" అంది. ఆర్సో జవాబు చెప్పకపోయేసరికి "మన వంశమూ ఒకప్పుడు ధనవంతంగానే ఉండేది. ఇప్పటి 'సిగ్నోరీ' (కార్సికన్ భూస్వాముల సంతతికి చెందినవాళ్ళు కార్పొరల్స్‌కీ వాళ్ళకీ 'అభిజాత్యయోగ్యత' విషయమై పోటీఉండేది-అ)ంకి తెలిసి పోము. అసలు కార్పొరల్స్‌కన్నా గొప్ప వంశం వారెవరున్నారు? వీరందరిలోనూ అగ్రగణ్యుడయిన సంతతివాడివని నీకూ తెలుసు ఆర్సో! నేనే నీ స్థానంలో ఉంటే మిస్ నెవిల్ విషయమై ఆమె తండ్రితో సంప్రదిస్తాను..."

"మన ఇంటి దగ్గరేఉన్న ద్రాక్షతోట కొనిఇస్తాను పెళ్లికి. మంచి ఇల్లుకూడా ఒకటి కట్టిస్తాను..."అని ఇంకా ఏమిటేమిటో చెప్పుకుపోయింది కొలంబా.

"కొలంబా నీకసలు బుర్రలేదు!" అన్నాడు ఆర్సో గుర్రంమీద వేగంగా స్వారీచేసి వెళ్లిపోతూ.

"ఆర్సొఆంటన్, నువ్వు మగవాడివి. నీకు తెలిసిన కొన్ని విషయాలు నాకు తెలియవని ఒప్పుకుంటాను. ఈ ఇంగ్లీషువాళ్లు మనతో సంబంధానికి ఇష్టపడరంటావా? ఇంగ్లాండ్‌లో కార్పొరల్‌లు లేరా?"

ప్రయాణం చాలాసేపే పట్టింది. అన్నా చెల్లెలూ ఒక చిన్న గ్రామం చేరుకున్నారు. ఆ ఊరిలోనే వారికి తెలిసినవారి ఇంట్లో ఆ రాత్రికి ఉండిపోయారు. కార్సికా దేశస్థులు అతిథులని బాగా ఆదరిస్తారు...

మర్నాడు, ప్రయాణం మళ్లీ కొనసాగించారు. ఆ ఇంటి యజమాని శ్రీమతి దెల్లారెబ్బియాతో బాటు ఎదిగినమనిషి. సాగనంపేందుకు కొంతదూరం వచ్చాడు.

"ఈ పొదలు, చిట్టడవిచూడు!" అన్నాడు ఆర్సోతో విడిపోయే ముందు "పోలీసుల బారినుంచి తప్పించుకోవాలంటే చాలా సౌకర్యంగా ఉంటాయి. కొన్ని సంవత్సరాలు పట్టుబడకుండా ఉండిపోవచ్చు. ఈ అడవి అవతలవైపే నిజవోనా

అరణ్యంఉంది. నీవద్ద నుంచి తుపాకి ఉంది. ఎంతదూరం పోతుందో దీనిలో గుండు! మేరీమాతమీద ఒట్టు! ఇటువంటి తుపాకి చూడలేదు! దానితో ఎన్నో పక్షుల్ని కాల్చెయ్యొచ్చు!"

ఆర్సోకి ఇతని ధోరణి నచ్చలేదు. అది ఇంగ్లీషు తుపాకి అనీ, గుండు చాలా దూరమేపోతుందనీ చెప్పాడు అన్నా చెల్లెళ్ళు ఇద్దరూ సెలవు తీసుకుని ముందుకి సాగిపోయారు.

పియత్రనెరా సమీపించారు. వీరు ఒక చిన్న కనుమలోనుంచి వెళ్ళవలసివచ్చింది. దాని దగ్గర ఏడు ఎనిమిదిమంది తుపాకులు చేతపట్టుకున్నవారు కనిపించారు. వారిలో కొందరు రాతిబండలమీద కూర్చుని ఉన్నారు. మరికొందరు పొదలకింద పడుకునిఉన్నారు. వారిగుర్రాలు అవతల కొంతదూరంగా మేస్తున్నాయి. కార్సికన్‌లు అందరి దగ్గరా ఒక చిన్న దూరదర్శిని ఉంటుంది; కొలంబా తన టెలిస్కోప్‌తో వారిని పరీక్షగా చూసింది

"మనవాళ్ళే!" అంది సంతోషంగా. "పియరుచ్చియో, చెప్పినట్లే చేశాడు"

"మనవాళ్లంటే?" అని అడిగాడు ఆర్సో

"మనఊరివాళ్ళు. పియత్రనెరా ప్రవేశించేముందు నీకు కొంచెం తోడు ఉండటం మంచిదని ఈ ఏర్పాటు చేశాను బారిచినీ ఎంతకయినా తగును!"

"కొలంబా," అన్నాడు ఆర్సో మందలింపు స్వరంతో. "నీ కింతకుముందే చెప్పానా, బారిచినీని గురించి అర్థంలేని అనుమానాలు పెట్టుకోవద్దని! ఈ అంగరక్షక దళంతో వెడితే ఎన్నుచూసి అందరూ నవ్వరూ! నాతో చెప్పకుండా చేసి

36 వ పేజీ చూడండి

## వివిధప్రాంతాల వింతలు 21

# జుయిడరిజీ ద్వీపాలు

కొన్నేళ్ళక్రిందట హాలెండులో నీరు నింపుటయే వ్యావృత్తిగా వుండేది. అంటే చితచితలాడే భూములకు నీరుపెడ్తే బాగుపడి బంగారు పంటలు పండుతాయనుకొనేవారు. హాలెండులోని అలాంటి జుయిడర్‌జీ ద్వీపాలు మారిపోయి ఇప్పుడు విలాసయాత్రీకులను బాగా ఆకర్షిస్తున్నాయి.



హాలెండ్ దేశపు మోన్నికెన్ డామ్‌లో ఒక వీధి.

ఈ జుయిడర్‌జీ ద్వీప సముదాయంలో సుమారు 670 ఎకరాలవిస్తీర్ణంగల మార్కన్ ద్వీపాని ఓపదేళ్ళక్రిందట హాలెండు ముఖ్య దేశానికి కలిపివేశారుకాని, చుట్టుపట్ల నీరు లోపలికిరావటం జరిగితే ముఖ్యతీరానికీ దీనికీ సంబంధమే ఉండదు అలాంటిదైనా ఈ మార్కన్ ద్వీపం ఎంతోమంది విలాసయాత్రీకులను ఆకర్షిస్తోంది. ఈ మార్కన్‌ద్వీపంలో అన్నిటకన్నా విలాసయాత్రీకులవల్ల రాబడే ఎక్కువ

ఈ హాలెండు దేశంలో బ్రోయెక్ మొన్నికెన్‌డామ్, ఎడామ్, వొలెన్‌డమ్, మార్కన్‌ద్వీపం ఇవి చూచేందుకు ఓరోజుపడుతుంది. ఈ డచ్చి రాజధాని ఆమ్‌స్టర్‌డాంకు వచ్చే విలాసయాత్రీకులెవ్వరూ ఇవి చూడకుండా వెళ్ళరు

బ్రోయెక్ చిన్నపిల్లల ఆటస్థలంగా తమాషాగా వుంటుంది. అన్నీ కొయ్యతోకట్టిన ఇళ్ళు వాటికి మెరుగు పూసిన పెంకుకప్పులూ, చిన్న చిన్న దుకాణాలు వుంటాయి అయినా చాలావరి శుభ్రంగా వుంటుందీపట్నం

మొన్నికెన్‌డామ్‌పట్నం చాలా పురాతనంది. ఇక్కడ ఎక్కువగా 15-16 వ శతాబ్దపు కట్టడాలే కన్పిస్తాయి. ఈపట్నం ఫోటోలు తీసుకోవాలంటే ఎన్ని అడుగుల ఫిలమ్మైనా బాగానేవుంటుంది

ఈ దేశంలో చూడదగ్గవాటిల్లో అతిముఖ్యమైంది 1591 సం॥ కట్టడం 'ప్లేయింగ్ టవర్''

ఏడం పట్నం ఆమ్‌స్టర్‌డాంకు సుమారు 12 మైళ్ళదూరంలో వుంటుంది ఈఊరి 'టౌన్‌హాల్'లో ఆకుపచ్చ బంగారుపూతలలో వున్నన్యాయస్థానం చాలా అందంగావుంటుంది ఈ పట్నాన్నిగురించివున్న పుక్కిటి పురాణాలకు లెక్కేలేదు. అంతప్రసిద్ధిగల పట్నం ఇది

హాలెన్‌డం అదోరకమైన స్వర్గంలాగా వుంటుంది పని వున్నప్పుడు లేనప్పుడు వాళ్ళుండే విధం, ధరించదుసులూ చూస్తుంటే అసలు వీళ్ళకు శ్రమంటే ఏమిటో తెలుసా అనిపిస్తుంది. ఇక్కడి ఆటవాళ్ళు వేసుకునేదుస్తులు చాలా చూడముచ్చటగావుంటాయి ఏడుపొరలుగల దుస్తులు వేసుకోటం ఇక్కడి అలవాటు (స్త్రీలకి), ఈ దుస్తులకు అందమైన కుట్లులు. అల్లికలువుంటాయి.

మగవాళ్ళేమో నల్లని లాగూలు వేసుకొని బొత్తాలకు బదులుగా వెండిముక్కలువయోగిస్తారు. పైన ఎర్రటి, తెల్లటి అంగీలు ధరిస్తారు

మార్కన్‌లో మగవాళ్ళు మోకాలి పొడుగు దుస్తుల వేసుకోవటం చూస్తే మధ్యధరా సముద్రప్రాంతం వాళ్లలాగే అనిపిస్తారు. ఈ ప్రదేశంకూడా విలాస యాత్రికులకు ఆకర్షణీయంగానే వుంటుంది. పురాతన భవనాలు, చర్చిలతో చాలా హుందాగా వుంటుంది.

— టెంపిల్ మానింగ్. ★

# ప్రేమ గాలం

వీరాజీ

## జరిగిన కథ

పద్మావతి తల్లి జయమ్మ అనుమతితో వాల్తేరు పోయి ఎమ్మేకి అప్లికేషన్ పెట్టి గుంటూరువస్తూ బెజవాడలో భాస్కరం-నేస్తం పద్మావతి తన నేస్తం సురేఖను భాస్కరానికి పరిచయంచేస్తుంది భాస్కరంపిన్ని జానకమ్మగారు కూతురు వసంత పెళ్లిచేద్దామనీ, తర్వాత భాస్కరంపెళ్లి చేద్దామనీ, ప్రయత్నాలు చేస్తోంది సురేఖవాళ్ళ దొడ్డమ్మగారిదీ బెజవాడే. చదువు ఎంక మీద భాస్కరంపెళ్లికి విముఖత చూపుతూం టాడు. కాని జానకమ్మగారి ముచ్చటవేరు ఆమెకు అధికారం, ప్రేమా-రెండూ ఎక్కువ ధనమ్మ రాఘవేంద్రరావులు వసంతను ముకుందరావుకు చేసుకోడానికి చూశారు. భాస్కరం విముఖతను పసిగట్టిన వసంత భాస్కరాన్ని నిలదీస్తుంది జానికమ్మగారి బలవంతాన పెళ్లిచూపులకని వెళ్లి అక్కడ సురేఖను చూసి హతాశుడైపోయాడు ధనమ్మ భాస్కరాన్ని సురేఖకు చేసుకోవాలని తీర్మానించుకుంటుంది. జానకమ్మగారు భాస్కరం విముఖతకు ఆరాలు తియ్య జూస్తుంది. ధనమ్మ పంతం పెరుగుతుంది. జయమ్మ, పద్మావతి గురించీ, వాల్తేరు చదువు గురించీ ఆందోళనగా గతం తల పోస్తూంటుంది. పద్మావతీ సురేఖా వాల్తేరు వస్తారు. మూర్తి బాస్కరం నేస్తం. ఇద్దరూ బీచ్‌లో పద్మావతి గురించి ప్రస్తావించుకుంటారు. భాస్కరం సురేఖకు చెప్పి బెజవాడ వెళ్తాడు. సురేఖ పద్మావతి కలిసి సినిమాకు వెళ్తారు. భాస్కరం బెజవాడ వెళ్లి వసంత పెళ్లి స్థిరపర్చుకుంటాడు. సురేఖను పద్మావతి కలుసుకుంటుంది.

## 29

కోలాహలంగావుంది విశ్వ విద్యాలయ ఆవరణమంతా! తోరణాలు, ద్వారాలు, అంతా సంబరంగా ుస్తాబు చేసుకుంది. "యూనివర్శిటీ కాలేజీ న్నిం"టా ఎగ్జిబిషన్ జరుగుతోంది. మూడేళ్ల 'సారి జరిగే ఎగ్జిబిషనే అయినా, గత రెండు ూడు దశాబ్దాలుగా ఉంటున్న విశ్వవిద్యాయమే అయిన పాత ఏట్కి కొత్త చిరు వచ్చి నట్లు పాత మొక్కకి కొత్త పూత పూసినట్లు అంత కలకలంగా, కన్నుల పండువుగా ఉంది. యువతీ యువకులంతా, ఏ 'శాఖ' కా 'శాఖ' ఏ విభాగాని కా 'విభాగం' ఏ కాలేజీ కా కళాశాల, విజ్ఞానాన్ని, వినోదాలుగా, విన్యాసాలుగా మార్చి యూనివర్శిటీ ఎగ్జిబిషన్‌గా రూపొందారు

జనం చూస్తున్నారు. చాలామంది మూడు సంవత్సరాలక్రితం పెట్టిన ప్రదర్శనలే బాగున్నాయంటున్నారు. మూడు సంవత్సరాల క్రితం ఈ మాటే అన్నారు కొందరు—మూడు సంవత్సరాల తర్వాత తిరిగి ఈ మాట "ఈ సారిదే బాగుంద"ని అంటారు కూడా

మిట్ట పల్లాలను, ఎగుడు దిగుళ్లను అందంగా కలిపి, భవనాలు కట్టినది వాల్తేరు యూనివర్శిటీ- - విద్యార్థులు ఎక్కువ మంది, విద్యార్థినులు తక్కువ మందీ అయినా, సందడి సంబరం అంతా విద్యార్థినుల చుట్టూరా పెరుగుతోంది వెతుక్కోకుండానే అడావుడీగా, అక్కర్లేకపోయినా ఆదుర్దాగా, జనం కలివిడిగా తిరుగుతున్న తరుణంలో, సూర్యుడు సైతం పిళ్ల సర్దా సంబరాల ముందు పిగిపోయిన సమయంలో—

భాస్కరం ఆర్ట్సు డిపార్టుమెంటులో ఏదో పోగొట్టుకున్న వాడిలాగ వెతుక్కుంటూ వచ్చాడు

పద్మావతీ, సురేఖా ఒకే స్టాలు దగ్గర ఉన్నారు

జనానికి వాళ్లిద్దరూ "రికార్డు ప్లేయర్" మీద "టు బీ ఆర్ నాట్ టూ బీ" (షేక్సిపియర్ నాటకం వేసి) వినిపిస్తున్నారు

"ఎలా వెళ్ళడం?— ఆ ఇద్దరూ ఒకేసారి తనను చూసి ఏమనుకుంటారు?

"దగుల్బాజీ" అనుకోరూ ....

"ఒక్కరే అయితే వెళ్ళగలను. ఇద్దరున్నారే ." అక్కడే నిలబడ్డాడు......

అటూ, ఇటూ జనం క్యూలో నించున్నారు. "మొవ్వాన్! కదలండి మాష్టారూ" అంటున్నారెవరో.

"అమ్మాయి లిద్దరు సీతాకోక చిలుకల్లా అగుపిస్తోంటే—చిలక పలుకుల్లా నాలుగూ విడమర్చి చెబుతూఉంటే ఈ బ్రహ్మోపతారం కదల్దేం?" నలుగురూ తనను విసుక్కుంటున్నారు.

భాస్కరం బయటకు వచ్చాడు. అంతలో రివ్వున మూర్తి వచ్చాడు.

"బ్రదర్! నేను శైలజతో మాట్లాడా" నన్నాడు గొప్ప ఫీట్ చేసి వచ్చిన వాడిలాగ.

"శైలజా?" భాస్కరం మెల్లిగా అన్నాడు.

"శాబరా! నువ్వు బాగుంటుందీ అనే వాడవుగా—సన్నని ముక్కూ, ముక్కున ముచ్చటగా పుడకా.......దట్ టాల్ అండ్ స్లిమ్ గాల్...." మూర్తి ప్రపంచ యుద్ధంలో గెల్చి వచ్చినట్లున్నాడు.

"ఏమందిరా!" భాస్కరం అడిగాడు.

"ఆ అమ్మాయేం?!......" చెప్పబోతూ, అంతలో ఆగి, "ఉహూ! కమాన్ ఇలా కాదు ఇక్కడ ఇది సంత గోల—ఆ కాంటీన్‌లో ఓవార మనం జయించాం—స్పెషల్‌గా సీట్ లున్నాయి. చెబుతారా" అన్నాడు మూర్తి

"కాని బ్రదర్! నాకో చిన్న పని ఉంది ..." కన్నీళ్ళొక్కటి తక్కువగా, ఇంచుమించు దీనాతి దీనంగా అన్నాడు భాస్కరం

"ఏం --ఏ చల్లనమ్మ బోవు భామకై వేచితివిరా ఇందు?" నవ్వాడు మూర్తి కాస్త వెటకారంగా—

"ఓ చల్ల నమ్మాయి కోసరం" భాస్కరం కూడా శ్రుతి కలిపాడు.

"అయితే! ఆ 'జలజ'గారి కోసరమేగా—ఆవిడ ఇప్పుడు యమ బిజీగాఉంది గానీ — ప్రస్తుతం రా! శైలజ గురించి చెబుతా" లాక్కుపోయాడు మూర్తి

భాస్కరం కాఫీ రాంగానే త్రాగేశాడు— "మంచి నీళ్ళు కావురా" అన్నాడు మూర్తి ఆశ్చర్యపడి !

సిగ్గుపడ్డాడు భాస్కరం ..

"నిజంగా మంచినీళ్లే అనుకుని త్రాగేశానురా బ్రదర్" అన్నాడు పరధ్యానంగా

"మరే! పడ్డావురా ప్రేమలో పోనీగాని... ఇది విను.. " చెప్పసాగాడు మూర్తి

"శైలజను నేను ఓసారి బస్సులో చూశాను.... కొంటెగా చూస్తుందిరా ఆ అమ్మాయి! సరిలే . .. అలవాటేమో ననుకున్నా .కాని దిగుతూన్నప్పుడు వెనుదిరిగి చూసిందిరా .. చూసి కిసుక్కున నవ్వింది కూడా ..... ఇంక చూడు భాయ్! నాకు గుండెల్లో ఎలక్ట్రిసిటీలా కదిలింది—"

"చూడు మూర్తీ....నువ్వు కూడా...."

"వాట్‌డుయూ మీన్? నేనేం వామనమూర్తి నా?

పైగా అది శైలజ నవ్వురా! బ్రదర్ దానికి గుండెల్లో దూరి కాపురం ఉండే కలత పెట్టే నైజం ఉందీ....."

మూర్తిని ప్రేమగా చూసి, "ఓ. కే... ! చెప్పు! గో ఎహెడ్!" అన్నాడు భాస్కరం

మూర్తి సిగరెట్ కాలుస్తూ, చాలా కథ చెప్పాడు

శైలజ ముక్కుమీద మల్లెమొగ్గ కొస ఉందన్నాడు. ఆ అమ్మాయి కళ్లల్లో వశీకరణ మంత్ర శక్తి కాపుర మున్న దన్నాడు. అలా యిలా చాలా అన్నాడు.

"అసలింతకీ ఇవాళ ఏమి టేడ్చేవోయ్?" విని విని మండిపోయాడు భాస్కరం.

"ఉండవోయ్! మిస్టర్ జెలసీ! ఇవాళ శైలజ నీలిరంగు చీరె కట్టుగుంది వాళ్ళ డిపార్టుమెంట్ ఎగ్జిబిషన్‌లో పూల మొక్కలు సెక్షను పెట్టారులే . అందులో ఎన్ని రకాల పూల మొక్కలూ, పూల గుత్తులు—పళ్ళూ అవీ ప్రదర్శిస్తున్నారో నీకూ తెలుసుగా..... వాటి మధ్య శైలజ అచ్చం వన కన్యలా......అసలు పువ్వులా....."

"లేళ్ళూ, నెమళ్ళూ ఉన్నాయా?"

"తోడేళ్ళు, నక్కలూ ఉన్నాయి......వినరా అంటే ..." విసుక్కున్నట్లు మొహంపెట్టి అన్నాడు మూర్తి.

"చెప్పరా! షేక్స్పియర్!.....రోమాన్స్‌రాయి!" భాస్కరం వినసాగాడు.

"శైలజ, నీళ్ల కుండీలో ఇన్ని ఎర్ర గులాబీలు, నల్ల ద్రాక్షపళ్ళూ పడేసుకుందిరా. . . అణాయిస్తే చాలు, ఆ నీళ్ళ కుండీలోనించి పువ్వు లేదా పండూ తీసుకోమందిరా... .."

"ఎంతమంది ఎన్ని అణాలు ఇచ్చారు?" పక పకా నవ్వాడు భాస్కరం.

"ఉండవోయ్—అందరూ నీళ్ళల్లో చెయి పెట్టడం అమ్మ బాబోయ్ మని 'షాక్' కొట్టి చెయ్యి తీసెయ్యడం.....ఆ నీళ్ళకు కాస్త ఎలక్ట్రిసిటీ పట్టించారులే వాళ్ళు . . అదీ సంగతి"

"బహుశా మీ శైలజ చూపుల్లోదై ఉంటుంది" భాస్కరం అందించాడు

"మరే! వినూ.. నేనేం చేశానూ. సాహసం చేసి పోతే పోయింది ఎడం చెయ్యే కదాని ఈ నా వామహస్తంబును', 'డింగ్' మని దూర్చి రెండు పువ్వులు లాగేసుకున్నాను.....మై గుడ్నెస్.... ఆ అమ్మాయి కళ్ళు 'అప్రిసియేషన్'తో ఎలా మెరిశాయనుకున్నావ్?"

"నీ చెయ్యి ఏమంది?" నవ్వాడు భాస్కరం.

"జివ్వుమంది ......వెధవది ఆ వోల్టేజీ ఓలెఖ్ఖా మనకి, శైలజ చూపుల్లోని విద్యుత్తు గుండెల్లో జివ్వు మందిగా....." మూర్తి కూడా నవ్వాడు— మళ్ళీ మధురానుభూతిని స్మృతికి తెచ్చుకుని,

"మాష్టారూ! రెండు పూలు పట్టుకు పోతున్నారు..... అణాకి ఒక్కటే" అన్నదిరా ఆ అమ్మాయీ?.... అబ్బ! ఇది మరీ షాక్ అయిందనుకో......"

—"నన్నా?" అన్నాను వెంటనే......"

—"మరే! మరెవర్ననుకున్నారూ?" అంది. ఇలా చూసి......

—"ఐతే ఓ పువ్వు మీ కిచ్చేయ్‌నా?" అన్నాను నేను."

—"కాదూ, ఈ కుండీలో పడేయండి" అంది.

—"ఉహూఁ" కావాలంటే "ఏమేనా ఇస్తానుగాని, నేను అందులో మరి చెయ్యి పెట్టను," అన్నాను. ఆ పువ్వు ఆమె చేతికి అందిస్తూ .. ..మొదట అటూ, ఇటూ చూసింది గాని......తీసుకోనా, మానవా అని తటపటాయించిందిగాని, తీసేసుకుందిరా.. .. చివరికి" మూర్తికి ఆనందం పట్టలేనట్లుంది.

"గుడ్! ఇంకేం—వాళ్ల నాన్నగారి ఎడ్రస్ తీసుకో....."

"ఛా! ఎంతమాటన్నావురా......విరహం అనక సందేశం తర్వాత ప్రణయం, తదుపరి....."

"ఇంకేమిటి నీ మొహం—నీకు క్లాసులో

41 వ పేజీ చూడండి



## పోలీస్ చీఫ్ మైక్ గియర్

# "సర్కస్‌తో పయనించిన మరణం"

## నా అనుభవంలో కెల్లా పెద్ద పరిశోధన-18 (వాన్‌కువర్. బి. సి. కెనడా)

(గత సంచిక తరువాయి)

అది డానాలీ శరీరమని నిర్ధారణవక పూర్వమే డాక్టర్ ఎ. ఎ. ఎప్లెబీని పరీక్ష చెయ్యమన్నాము. మరణం ఎలా సంభవించిందో కనుక్కోడం అతి సులభం. బూటుతాడు మెడకు బిగించి ఎవరో చంపారు. పొడుగాటి బూటు తాళ్ళుండే బూట్లు వేసుకునే ఈ దేశంలో హత్యలు సామాన్యంగా ఈ రకంగానే జరుగుతుంటాయి. శ్వాస ఆగడం వల్ల, నరాలు వుబ్బి చనిపోయింది. ముఖంమీద, చేతులమీద గీరలున్నాయి. కనుక చనిపోయేలోగా ఆమె హంతకునితో కొంత పోట్లాడినట్టు, పెనుగులాడినట్లు తెలుస్తోంది. కానీ, నేల చూస్తే, గడ్డి గాదం ఎక్కడా చెక్కు చెదిరినట్లులేదు. కనుక ఈ పెనుగులాట మరోచోట జరిగి ఉండాలన్న మాట!

శవం డానాలీది అని తేలింది. ఆమె జేబులో సంపాదించుకున్న అరవై సెంట్లు అలాగే ఉన్నాయి. ఆఫీసుకు వచ్చాక స్థిమితంగా కూర్చుని ఆలోచన ప్రారంభించాను. నాకు రెండు విధాలయిన వూహాలు తట్టాయి. ఒకటి: సర్కస్ చూస్తున్న ఆమెను ఎవడో చూసి, ఆశపడి, వంచించి, బలాత్కరించి, ఆనక హత్య చేసి ఉండాలి. ఆమె జేబులో డబ్బులన్నీ అలాగే ఉన్నాయి. డబ్బంతా ఖర్చయిపోయే దాకా సర్కస్‌చూసే స్వభావం కల మనిషైనా, జేబులో డబ్బులు కదల్లేదు. రెండు: దాని వేరే చోట చంపి, శవాన్ని మేము కనుక్కున్న చోటుకు మోసుకుపోయి ఉండడం గనుక నిజమైతే ఆమె నా ప్రదేశానికి తీసుకు రావడానికి ఏదైనా వాహనం ఉపయోగించి ఉండాలి.

మర్నాడు తెల్లవారు జామున ఆరింటికి ఆ ప్రదేశానికి వెళ్ళి, ఏవైనా ఆనవాళ్ళు దొరుకుతాయేమోనని నడుం విరిగేలా నాలుగ్గంటలు వెతికి, కృతార్థుల మయ్యాము.

బంకగావున్న ఒక ప్రదేశంలో కారాగినట్టు బోధ పడింది. టైరు గుర్తు కనబడింది. టైవంపీద భారంవేసి, కాళ్ళు జాచుకుని కూచునే రకం మనుష్యులుకారు మా సాంకేతిక నిపుణులు. ఇంత కష్టపడి ఈ విషయాన్ని తేల్చినంత మాత్రాన్న మేము పరిశోధనలో చాలా భాగం ముందుకు వచ్చినట్టేమీకాదు. అలాటి టైరులు గల కార్లు కొన్ని వేలుండచ్చు, ప్రతీ టైరూ అనుమానించి, ఆ టైరు తాలూకు కారును, కారు యజమానీని అనుమానించుకుంటూ పోవాలంటే సాధ్యమయ్యే పనికాదు.

దూరంగాఉన్న ఇనస్పెక్టర్ని, "మిస్టర్ ఫూలర్" అని కేకేసి, "నేను సర్కస్ వాళ్ళని వెంబడిస్తాను. మన వాళ్ళు వెంబడిస్తున్నా నాకు తృప్తిలేదు. నేనే వెళ్తాను" అన్నాను.

ఫూలర్ ఆశ్చర్యంగా నోరు తెరిచి, "అంటే" అని కాస్సేపాగి, "వారి వద్దనుంచి ఏమీ సమాచారం తెలియలేదు. అతని (ఆన్డర్సన్) నడపడి, సత్ప్రవర్తన గురించి నాకేం పనిలేదు. కానీ, అతనీ సమయంలో పారిపోవడంవల్ల అతన్ని అనుమానించి తీరాల్సి వస్తోంది" అన్నాడు.

"లేదు" అని కోపంతో అరిచి, ఆనక పశ్చాత్తాపపడి, "నేనేం షెర్లాక్‌నికాదు. కానీ, నేను కూడా కొంతమటుకు వూహాగానం చెయ్యగలను డానా జేబులో అరవై సెంట్లున్నాయి. అందులో ఏ మాత్రం ఖర్చు చెయ్యనేలేదు. కనుక ఎవరైనా, ఆమెకోసం ఖర్చుచేసి ఉండాలి. సర్కస్ ట్రూపులో ఎవరైనా అయ్యుండచ్చు. కానీ, ఆ ఇండియన్ మాత్రం అయ్యుండడు" అన్నాను.

ఇంతలో తలుపు శబ్దమై, మా క్కావలసిన వాళ్ళలో ఒకడైన పాల్ జోహాన్సన్ వచ్చాడు.

"హారే! ప్రపంచంలో ఏ మారుమూలకి వెళ్ళి దాక్కున్నావయ్యా నువ్వు? నీ కోసం నీ తలిదండ్రులు ఎంత బెంగ పెట్టుకున్నారో తెలుసా?" అన్నాను

"మరేం" అంటూ తడబడి, "మరేం, అనుకోకుండా వెళ్ళిపోయానండి. మరేం మీకు తెలియకుండా పోవాలనికాదు. వాన్ కువర్‌కి వెళ్ళే కారులో నాకు ఛాన్సు దొరికింది. మరేం దారిలో దిగి, వాన్‌కువర్ వెళుతున్నానని చెప్దామనుకున్నాను. కాని, కారు ఈ దారిన వెళ్ళలేదు. మరేం పొరపాటైపోయింది. మరేం చెయ్యను? ఇంకెప్పుడూ ఇలా చెయ్యను" అన్నాడు.

అతను చెప్పినదంతా శుద్ధ అబద్ధమని మేము గ్రహించాము.

* * *

నేనూ ఫూలర్ కలిసి 'టిరేస్' కి టిక్కట్లు కొనుక్కున్నాము. 'ప్రిన్స్ రూపర్ట్' చేరేలోగా ఆ సర్కస్ 'టెరేస్' లో మకాం చేస్తుంది. ఏదో కొంత మళ్ళీ ఈ కేసుకు గమనం కలిగిందని సంతోషించాను. సర్కస్ వారిని కలుసుకుంటే కొంతైనా లాభం ఉండక పోదు. అదే ఆశ ఆసుకోవచ్చు నిరాశా నిస్పృహానుంచి, ఆశ, ఉత్సాహం వైపు నా మనస్సు మళ్ళింది.

మే మా చోటుకు చేరడంతోనే కార్ల్ విన్సెంట్‌ను ముందు పిలిపించాము.

"మీ షూటింగ్ గ్యాలరీనుంచి డానా ఎక్కడికి వెళ్ళింది?" అని ఫూలర్ అడిగాడు.

"ఆ ప్రశ్నకు ఇదివరకే సమాధానం చెప్పాను. నన్ను నమ్మండి. నాకే పాపం తెలియదు" అన్నాడతను.

"సరే! ఆమె నెవరితోనైనా చూశారా?"

అతను సమాధానం చెప్పడానికి కొంత టైము తీసుకున్నాడు. అతని ముఖ కవళికలు చూస్తే, ఏదో దాస్తున్నాడనిపించింది. నాకు చిర్రెత్తి, "మిస్టర్ విన్సెంట్! ఇది హత్యా సంబంధమైన కేసు పరిశోధన. తెలిసిన విషయాలు దాచడం చట్ట విరుద్ధం. ఆమెతో ఎవరున్నారో చెప్పండి" అని అరిచాను.

అతను తలెత్తి నాకేసి చూసి, "జానొను. ఆ సంగతి నాకూ తెలుసు. కానీ, ఎవర్ని చూశానో

33 వ పేజీ చూడండి






భోజనానికి లేవబోతున్న సుందరరామయ్య 'పోస్టు' అన్న కేక విని ఉత్తరం అందుకున్నాడు. అది తన కొడుకు సత్యం వ్రాసింది.

పూజ్యులైన తండ్రిగారికి,

సత్యం వ్రాయునది. ఈ ఉత్తరం మీకు బాధ కలిగించవచ్చు మీరు నన్ను స్వంత ప్రాణంకన్న ఎక్కువగా చూశారు. మెడికల్‌లో చేరేముందు మీలాగే సివిల్ సర్జన్‌గా రిటైర్ అవుతానని ఆశించి ఉంటారు. కాని ఏం చేస్తాను? నా శాయశకులా ఈసారైనా పాసైపోదామని ప్రయత్నించాను కాని ఈసారి పరీక్ష కూడా నా కష్టం వేపు కాకుండా నా దురదృష్టం వేపు ఒరిగింది. ఏదిఏమైన మళ్ళా ఆశవాల్లో, ఎముకల్లో, దుమ్ముల్లో బుర్ర దూర్చి పరీక్షకి చదివే వోపిక పోయింది. అందుచేత మీకు ముందర చెప్తే ఒప్పుకోరని ఇక్కడే, ఈ వూర్లోనే ఒక ప్రయివేట్ కంపెనీలో ఉద్యోగం సంపాదించుకో గలిగేను. నన్ను పువ్వుల్లో పెట్టి, పెంచి, పెద్దచేసిన మీ ఆశయాన్ని కూడా తీర్చుకోలేక పోయినందుకు నేను చాలా విచారిస్తున్నాను నా చేతకానితనానికి నన్ను అన్యథా భావించరని తలుస్తాను. ఇట్లు,

మీ కుమారుడు,

సత్యం.

వచ్చిన ఉత్తరం చదువుకున్న సుందరరామయ్యకి చాలా ఆశ్చర్యం వేసింది. అచ్చంగా తనలాంటి పరిస్థితులే కాకపోయినా, ఇంచుమించు అలాంటి పరిస్థితే ఇన్నేళ్ల తరువాత తన కొడుక్కి ఎలా వచ్చిందా అని.

ఆ రోజుల్లో తను ఇంటరు ఫస్టు క్లాసులో పాసయితే సంతోషించడానికి కూడా ఎవ్వరు లేక పోయారు, ఒక్క తన తాతయ్య తప్ప. తనకి పన్నెండో ఏడు వచ్చేసరికి తల్లి, తండ్రి ఇద్దరు లేకుండా పోయారు. ఉన్న ఆస్తిని జాగ్రత్తగా చూస్తూ తనకి ఏ లోపం రాకుండా జాగ్రత్తగా చూసాడు తాతయ్య మెడిసిన్‌లో సీటు వస్తే తన కన్నా ఎక్కువగా సంతోషించినవాడు తన తాతయ్య. వెళ్లేముందు "డబ్బుకోసం యిబ్బంది పడకు నాయనా, ఎంత కావలిస్తే అంత మొహమాటం పడకుండా రాయ"మని మరీ, మరీ చెప్పి పంపించాడు, స్వంత తల్లిదండ్రులకంటె ఎక్కువగా పెంచిన తాతయ్య.

వచ్చిన కొత్తల్లో చదువు బాగానే సాగింది. అసలు తను కూడా తన బాధ్యతని, తాతయ్య తనకోసం పడుతున్న అవస్థలని అన్ని ఆలోచించుకుంటూ జాగ్రత్తగానే చదువుకుంటూ ఉండేవాడు. కాని ఒకసారి అనుకోని సంఘటన ఒకటి జరగడంతో తన జీవితం ఇంచుమించు ఒక మలుపు తిరిగిపోయింది.

అవి కాలేజీ వార్షికోత్సవాలు. తను కొంచెం ఫిజియాలజీలో మంచి మార్కులు తెచ్చుకుంటుండడంవల్ల తనని తనతో ఉషాదేవిని ఫిజియాలజీ 'ఎగ్జిబిషన్' దగ్గర వచ్చినవాళ్లకి బోధపరచడంకోసం వేశారు ఉషాదేవి తన క్లాసులోనేవున్నా కూడా తనెప్పుడు ఉషాదేవిని అంత దగ్గర్నించి చూడలేదు అసలు ఎప్పుడు మాట్లాడలేదు కూడాను అందులోకి ఉషాదేవి తనతో చనువుగా మాట్లాడుతుంటే సినిమాల్లో, నవలల్లో చెప్పినట్టు పెద్ద ప్రేమలాంటిది కాకపోయినా, ఒక రకమయిన ఆకర్షణ మాత్రం ఉషాదేవి పట్ల కలిగింది. అసలీ సంఘటనే తనని చదువునుంచి మరలించడానికి పునాది అయింది. అసలు అప్పట్నించే తను ఉషాదేవితో మాట్లాడ్డానికి శత విధాల ప్రయత్నించేవాడు. కాలేజీలో ఎన్నికలనో,

లేకపోతే చందాలనో ఏదో నెపంతో ఉషాదేవి ఇంటికి వెళ్ళి మాట్లాడి వచ్చేస్తుండేవాడు. పుస్తకంతీసి ఒక పది నిముషాలు చదివితే చాలు ఉషాదేవి మీదకే ఆలోచనలు పోయేవి. ఎంత ఆలోచించిన ఉషాదేవి సైకాలజీ ఎలాంటిదో తనకు అంతు పట్టేది కాదు. తను అప్పటికి వందసార్లయినా ఆమెతో మాట్లాడాడు. ఇన్నిసార్లు మాట్లాడిన తను అడిగిన వాటికి సమాధానాలు చెప్పటమో లేకపోతే ఏదో కొంచెం మాట్లాడ్డం తప్పిస్తే ప్రేమను వెళ్లబుచ్చడానికి కావలసినంత చనువిచ్చేదికాదు. అలాగని తను ఏ నెపంతో ఎన్నిసార్లు వాళ్లింటికి వెళ్లినా కూడా లేనని చెప్పించుకోకుండా వస్తుండేది. పోనీ ఏమైతే అదైందని ప్రేమని వెళ్లబుచ్చేద్దామంటే ధైర్యం చాలేది కాదు. పోనీ మరోనాడు చెప్పొచ్చులే అని తన అధైర్యంకి సమాధానం చెప్పుకుంటూ వాయిదా తీసుకుంటుండేవాడు.

ఇటూ, అటూ గొప్పగా ఉషాదేవి ముందర తిరగొచ్చని, తన బాధ్యతలేని పంక్షన్సు, టీపార్టీలు కోరుండి నెత్తిమీద వేసుకుంటూండేవాడు. ఇలానే తనకు తెలియకుండానే రోజులు గడిచిపోయాయి. "ఒరే బాబూ! ఇది మెడికల్, కొంచెం జాగ్రత్తగా చదవరా బాబూ!" అని తన రూము మేటు కనకరాజు నెత్తి నోరు కొట్టుకొని చెప్తుండేవాడు. కాని తను వింటేకదా! అది కాకుండా తనతో మొండి ధైర్యం కూడా వచ్చేసింది. ఇంటర్మీడియట్‌లాగ పరీక్షల ముందర కొంచెం కష్టపడితే పాసయిపోతానని. అసలు ఆ ధీమాతోనే కనకరాజు మాటలు లక్ష్యపెట్టలేదు

ఇంతలో యూనివర్సిటీ పరీక్షలు రానే వచ్చాయి అప్పటికి కాని తనకు తెలిసి రాలేదు, ఎంత కోర్సు ఉందో. పరీక్షల ముందర కోర్సు తనకి తలా తోక అందలేదు. కాని విధిలేక పరీక్షలకు హాజరయ్యాడు. తరువాత ఫలితాలు రానే వచ్చాయి అసలు అవి రాకముందరే తనకు తెలుసు, తన పరీక్ష పోతుందని. అందులో కనకరాజు, ఉషాదేవి అనుకున్నట్లుగానే పాసయ్యారు. మొదట్లో ఉషాదేవి తనకన్నా సీనియర్ అయిపోయిందని ఒక వేపు బాధగా ఉన్నా, వాళ్లలాగ చదువుతే తను మాత్రం పాసవ్వక పోదునా, అసలు ఫస్ట్ వచ్చి ఉండునేమో అని అనుకుంటుండేవాడు. ఇలా ఇన్ని అనుకున్నా ఉషాదేవి ఎదుట పడేసరికి పూర్వంలాగ ధైర్యంగా మాట్లాడలేక పోయేవాడు అసలు చూడనట్టుగా తప్పించుకొని తిరుగుతుండేవాడు. కాని ఉషాదేవి మాత్రం అప్పుడప్పుడు పూర్వంకన్నా ఎక్కువ చనువుగా పలకరించి ఎలా చదువుతున్నారని అడుగుతుండేది ఇది మరీ బాధగా ఉండేది. అయినా తను ముక్తసరిగా జవాబుచెప్పి వచ్చేస్తుండేవాడు.

ఈసారి నిజంగానే చాలా కష్టపడి సప్లిమెంటరీ పరీక్షలు వ్రాసాడు. 'థియరీ' బాగానే వ్రాసాడు కష్టానికి తగ్గట్టు. కాని 'ఓరల్' బాగా చెయ్యలేక పోవడంతో తన తెలివిమీద తనకే నమ్మకం పోయింది. ఉషాదేవి గురించి ఆలోచించుకోడానికి కూడా ధైర్యం చాలేదికాదు. మరీ ఈ జన్మలో ఈ పరీక్ష పాసవ్వలేననిపించేసింది. తనేదో పెద్ద డాక్టరు నవుతానని ఎంతో ఆశతో పంపించిన తాతయ్యకి చాలా ద్రోహం చేశాననిపించింది. మరి తాతయ్యని మభ్యపెట్టకూడదని నిశ్చయించుకున్నాడు. పెట్టె, బెడ్డింగు సర్దుకున్నాడు. కనకరాజొస్తే తను మెడికల్ వదిలేస్తున్నానని, ఎక్కడైన ఉద్యోగం చూసుకుంటానని చెప్పి పోదామని కూర్చున్నాడు.

ఇంతలో తలుపు తట్టిన శబ్దం వినపడగానే కనకరాజేమో అని తలుపుతీసి ఎదురుగా ఉన్న ఉషాదేవిని చూసి తన కళ్లనే నమ్మలేకపోయాడు. అయినా ఎలాగో తేరుకొని "ఇదేమిటండి ఎప్పుడు లేంది మా రూముకి ఇలా వచ్చారు, రండి కూర్చోండి" అని కుర్చీ లాగి కూర్చో మన్నాడు.

"ఆహా! మరేంలేదు మా బ్రదర్ మారేజ్, మిమ్మల్ని కనకరాజుగార్ని స్వయంగా పిలుద్దామని వచ్చాను" అని అంటూ ఎదురుగా ఉన్న పెట్టె, బెడ్డింగు చూసింది. చూసిన వెంటనే అడిగింది "ఇదేమిటండీ, ఇప్పుడేవి సెలవులు లేవు! ఇప్పుడు ఇంటినుంచి ఏమైన వైరు కాని, ఉత్తరం కాని వచ్చిందా అర్జంటుగా రమ్మని?"

"లేదండి! నేను మరి తిరిగి రాదల్చుకోలేదు. ఈ మెడికల్ ఒదిలేయ దల్చుకున్నాను. అసలు ఈ పరీక్ష పాసవుతానన్న నమ్మకం కూడా పోయింది ఇక మా తాతగారిని అనవసరంగా బాధపెట్టేకన్న ఎక్కడైనా ఉద్యోగం చూడదల్చుకున్నాను" అని తను ఏమి దాచకుండా ఆనాడు ఉషాదేవితో చెప్పేయడమే మంచిపని చేశాడు. లేకపోతే ఇవేళకి తను సివిల్ సర్జన్‌గా కాదుగదా, అసలు హెడ్‌క్లర్కుగా కూడా రిటైర్ కాకపోయి యుండుడేమో? ఈ వేళకి కూడా ఆనాడు ఉషాదేవి ఎంతో ఆలోచించి చెప్పిన మాటలు ఇంకా జ్ఞాపకం ఉన్నాయి.

"చూడండి. సుందరరామయ్యగారూ! మీరు ఈ మెడికల్ వదిలేసి ఉద్యోగంకి పోయినంత మాత్రాన మీ తాతగారికి బాధ పోతుందేమో కుంటున్నారేమో, అసలు మరింత బాధ పెట్టినవా రవుతారు మీరీసారి పాసయిపోతే మీ తాతగారే కాదు, మీరు కూడా జరిగిపోయినదాని గురించి బాధపడరు సరికదా, అసలు ఆలోచించరు కూడాను. ఈసారి మీరు తప్పక పాసవుతారన్న నమ్మకం నాకుంది మెడికల్లో ఎన్నోసార్లు పరీక్ష పోయిన కూడా, పెద్ద పేరు తెచ్చుకున్న డాక్టర్లని మన మెంతమందిని చూడలేదు. అసలు మెడికల్‌లో పరీక్ష పోవడం వింతకాదని మీకు కూడా తెలుసు అయినా మీ మనస్సు చాలా సున్నితం అవ్వడంవల్ల మెడికల్ వదిలేస్తా నంటున్నారు ముఖ్యంగా ఈ కోర్సులో కావాల్సింది గుండె ధైర్యం, ఓపిక! అంతేకాని ఏదో రెండుసార్లు పరీక పోయిందని మెడికల్ వదిలేస్తా ననడం కేవలం తెలివితక్కువతనమనే అనుకుంటాను. నే నివాళ ఇంత చనువుగా మీతో మాట్లాడేస్తున్నానని మీరు ఆశ్చర్యపడొచ్చు. ఇన్నాళ్లు నేను మీతో ముభావంగా ఉండడం మీరు శ్రద్ధగా చదువుతారని, అంతేకాని మీరు నాతో కలుసుకోడానికి, మాట్లాడ్డానికి పడ్డ అవస్థలు, తాపత్రయం నాకు తెలియక కాదు. అలాంటి పరిస్థితులలో నేనే కాదు, ఏ ఆడదైనా గ్రహించగలదు.

"కాని మీరు ఎన్నిసార్లు మా ఇంటి కొచ్చినా, చాలామందికి లేనని చెప్పించుకొని, మీకు చెప్పించుకోలేదంటే ఇప్పటికైన మీరు నన్ను అర్థం చేసుకున్నా రనుకుంటాను. మీరు పరీక్షలలో ఫెయిలయినంతమాత్రాన మీమీద నా అభిప్రాయం మారుతుం దనుకోటం, అది కేవలం మీ పొరపాటే అవుతుంది. అసలు తప్పనిసరి కనుక ఇప్పుడు చెప్తున్నాను. మీరు పాసయిన తరువాత మా అన్నయ్య ద్వారా మన పెళ్లి గురించి కదుపుద మనుకున్నాను. కాని ఇలాంటి పరిస్థితులలో ఈ సంగతి మీకు ముందర తెలియజేయడమే మంచి దనుకుంటాను. కనీసం నాకోసమైనా మెడికల్ వదిలేయ రనుకుంటాను" అంది ఉషాదేవి.

అసలా మాటలే తన్ను ఒక డాక్టర్ని, తరువాత సివిల్ సర్జన్‌ని, ఇప్పుడు రిటైర్ సివిల్ సర్జన్‌ని చేసిపారేశాయి. తలుచుకుంటే తను మెడికల్ పాసయిన తరువాత జీవితంలో విచారించవలసిందిగాని, బాధపడవలసింది గాని ఏమి లేదనిపిస్తుంది తనీ ప్రపంచానికి ముఖ్యమైన వ్యక్తి కాకపోవచ్చు తన పేరు ప్రఖ్యాతులు నాలుగు వైపుల అల్లుకోక పోవచ్చు, కాని తన సంతృప్తికి సరిపోయినంత మటుకు తనీ వృత్తిలో నిర్వహించాననే నమ్మకం మాత్రం పూర్తిగా ఉంది. తను డాక్టరుగా పొందిన గౌరవం, ఆనందం ఇంకా విధంగా లభించకపోయి యుండునని, ఒకవేళ లభించిన ఏదో కొరత మాత్రం ఉండకపోదని అనిపిస్తోంది తను ప్రయివేటు ప్రాక్టీసనరుగా, సివిల్ సర్జనుగా బాగా గడించాడు. కాని ఈ డబ్బంతా ఒక ఎత్తు, బాగుపడిన పేషంట్లు, వారి బంధువులు చూపే కృతజ్ఞత ఒక ఎత్తు.

తనకు ఒక్క కానీ కూడా దొరకని కేసులున్నాయి, అయితే నేం ఆనందంతో నిండిపోయిన వాళ్ల కళ్లు, కృతజ్ఞత తెలిపే వాళ్ల మాటలు, సంతోషం ఎన్ని లక్షలు గడిస్తే మాత్రం వస్తుంది? ఆరోజే గాని తన చదువుకు స్వస్తి చెప్పేఉంటే జీవితాంతం విచారించవలసి వచ్చేదేమో? ఇప్పుడంతా చూసిన తరువాత ఒకసారేమిటి, రెండుసార్లేమిటి, వందసార్లు ఫెయిలయినా బాధ లేదనిపిస్తోంది. ఇప్పు డవన్నీ వాడికెలా నచ్చచెప్పటం? ఇప్పు డెంత చెప్పిన వాడి కర్థం కాదేమో? జీవితాన్ని కాస్త ముందుకి దూసేలాగ వాడ్ని చెయ్యాలి. అని చెయ్యాలోచనలో బాధపడిపోతున్న సుందరరామయ్యని, "అదేమిటండీ, అంత చిన్న ఉత్తరాన్ని, గంటయి పట్టుకున్నారు. వేగిరం భోజనానికిలెండి!" అన్న ఉషాదేవి మాటలు ఈ లోకంలోకి తెచ్చి పడేశాయి.

"ఏమీ లేదు ఉషా! మనవాడు మెడికల్ వదిలేసి ఉద్యోగంలో చేరిపోయాట్ట!" అని ఉత్తరం ఉషాదేవికి చదవమన్నట్లు అందజేశాడు.

ఉత్తరం చదివిన ఉషాదేవికి కూడా కొంచెం ఆశ్చర్యం వేసింది కాని వెంటనే ఆశ్చర్యంలోంచి తేరుకొని "మీకు కొడుకే అనిపించుకున్నాడు! మీరే సున్నితం అనుకుంటే మీకన్నా సున్నితంలా గున్నాడు. మీరేమీ బెంగపడకండి, మనం సాయంత్రము బండిలో బయల్దేరి వెళ్లి నచ్చచెప్తే వినకపోడులెండి!" అని అంటూ లోపలికి దారి తీసింది ఉషాదేవి.

"నువ్వు చెప్తే, నేనేవిటి, వాడేవిటి, అసలు రాళ్లూ, రప్పలూ కూడా వింటాయేమో!" అని భోజనానికి లేచాడు, రిటైర్డు సివిల్ సర్జన్ సుందరరామయ్య. ★

# "నా చిన్ననాటినించీ నటనే నా ఆశయం తతిమ్మావి అభిరుచులే" రంగారావు





తెరమీద సంఘం బాలనాగమ్మ, చిత్రాలలో రంగారావు.

'తన పాత్రను బాగా మననం చేసుకుని పూర్తిగా దాని సంగతి తెల్సుకుని గాని ఎస్. వీ. రంగారావు దాని కొక కొత్తదనాన్ని యివ్వడానికి ప్రయత్నించ'నన్నారు

శ్రీ రంగారావుతో నేను తెలుగు తమిళ సినీమారంగాల మార్కెట్‌లో గల తేడాలను ప్రస్తావించినప్పుడు "నిజానికి తెలుగు సినీమా రంగానికి టాలంట్‌ను సవ్యంగా వాడుకోగల శక్తి సామర్థ్యాలు కొరవడుతున్నా యని" ఆయన పేర్కొన్నారు.

## "కేవలం డబ్బా?..."

కేవలం డబ్బు మాత్రమేనా ? కాదు కళ అనేది అంతకంటే ఉదాత్తమైనది యింకొకటి ఉన్నది' అన్న దాయన విశ్వాసం

మంచి మాటకారి మాత్రమే కాదు 'డ్రామా' మీద అథార్టీతో మాట్లాడే వ్యక్తి శ్రీ రంగారావు

## అభిరుచులు

బి ఎస్ సీ బోటనీ చదువుకున్న శ్రీ రంగారావుకు ఆటలంటే యిష్టముండేది మొదట్నించి, వేట అంటే యిప్పటికీ ఇష్టం తుపాకీలు రకరకాలు తన దగ్గర పుస్తకాలు తనవద్ద రకరకాల్వి ఉన్నట్లే, ఉన్నాయి

ఈయనకు సొంత డ్రామా ట్రూపు ఉన్నది దానితో డ్రామాలుచేసి దేశ పర్యటన చేయడం నలుగురికీ కళాత్మకమైన ఆనందాన్ని పలచడం ఈయన ఆశయాల్లో ఒకటి

ప్రస్తుతం శ్రీ రంగారావు ఐదారు తెలుగు సినిమాలలోను అంతకుమించి తమిళ చిత్రాలలోను నటిస్తున్నారు

విజయావారు తీయనున్న చిత్రంలో తాను డబుల్ రోల్ వేయొచ్చునని చెప్పా డాయన



"తన కావల్సిన పుస్తకాలు తనదగ్గరే!" (రంగారావు)

## ఏ వేషమేసినా...

ఏ వేషం వేసినా శ్రీ రంగారావులో ధాటి, హుందా రెండూ ఉట్టిపడుతూ ఉంటాయి హరిశ్చంద్రుడుగా అతని పాత్రధారణనుగాని, లేదా, మాయలమరాఠీగా అతని పాత్రధారణను గాని,

# తెరమీద తెరవెనుక

**పీరాజీ**

మరచిపోలేం. ఒకే వ్యక్తి గంభీర, ఉదాత్త పాత్రలను పోటీపడి నటించడంలోను, ఒప్పించడంలోను 'కళ' సార్థక మవుతున్నదని భావించవచ్చును. చివరికి "షావుకారును" కూడా మరిచిపోలేం మనం.

శ్రీ రంగారావు నిజ జీవితంలో తృప్తి, సంతోషము గల వ్యక్తి. తన పాత సంప్రదాయంమీద, కొత్త పంథా పట్ల కూడా సగర్వమైన, లేదా గర్వమైన గురి, విశ్వాసమూ గల యీయనకు, అనేక విషయాలలో 'దర్జా' అంటే యిష్టం.. హుక్కా పీల్చగల అలవాటూ ఉంది.

## నాకు కర్ణుడు వేషం వేయాలనుంది...

"నాకు కర్ణుడు వేషం వేయాలనుంది. నాకు మంచి నటన అంటే విపరీతమైన దాహం అనండి లేదా తృష్ణ అనండి అలాంటిది ఉన్నది" అంటాడాయన.

పాత బాలనాగమ్మలో కీ. శే. గోవిందరాజుల వేసిన మరాఠీ వేషాన్ని దరిమిలాన మరోసారి మరో రకంగా వేసి ఒహో అనిపించుకున్న శ్రీ రంగారావు సామాన్య నటుడా? కాదు.

## కొత్త కావాలి

"కొత్తవాళ్ళను రానివ్వాలి. కొత్తదనం కొత్తనటులు వస్తారేమోనని పాతవారు భయపడకూడదు. ఛాలెంజీగా తీసుకొని కుర్రాళ్ల ముందు నటించి, వారినీ పైకి రానివ్వాలి, తాముూ తమ శక్తి సామర్థ్యాలు నిరూపించుకోవాలి" అంటారు శ్రీ ఎస్. వి.

'నాటకీయత' 'నటన' రెండూ ఒక సంఘర్షణ ఒక అధ్యయనమూ పూర్తిగా సాధించిన శ్రీ రంగారావును తెనుగు తెర సవ్యంగా వాడుకుందికి యింకా అవకాశాలున్నాయి అంటారు. కంసుడూ, కీచకుడూ, ఘటోత్కచుడు, హిరణ్యకశిపుడు మాత్రమే కాక 'నమ్మినబంటు', 'బంగారుపాప' 'హరిశ్చంద్ర' లాంటివి చూసినవాళ్ళు!





తెరమీద శత చిత్రయాత్ర చేసిన రంగారావు

'హిందూస్తాన్ మినరల్స్' అనే కంపెనీ బోర్డు ఆఫ్ డైరెక్టర్లలో ఒకడైన శ్రీ రంగారావు యిప్పట్లోనే ఆ కంపెనీ తరఫున అమెరికాకు వెళ్లగల అవకాశా లున్నాయని నాతో అన్నారు.

వెళ్లితే మాత్రం తెనుగుదనాన్ని గంభీరంగా అక్కడ చూపి రాగలరన్న విశ్వాస మాయన కున్నది. అదే ఆయన అభిమానులలో చాలా మందికీ ఉన్నది.

శ్రీ రంగారావు తెనుగు, తమిళ, వెండి తెరకు ఒక అమూల్యమైన కళాకాన్క — అతనికి యింకా ఉజ్వలమైన భవిష్యత్ను ఆశాంతిస్తున్నాను. ★



హుక్కాపీల్చడమే హాయి. (రంగారావు)

## గ్రహస్థితి

మిథునంలో రాహువు, సింహంలో సూర్య శుక్రులు, కన్యలో బుధుడు, కన్య తుల, లలో అంగారకుడు, ధనుస్సులో కేతువు, మకరంలో శని, మీనంలో గురువు, ధనుర్మకర కుంభ మీనాలలో చంద్రుడు.

**30-8-1963 శుక్రవారము మొదలు**

**5-9-1963 గురువారము వరకు**

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

ప్రస్తుతము మీ మాట నెగ్గాలంటే కొంచెము కష్టపడక తప్పదు. మీ ఆలోచనలు సాఫీగా సాగ కుండా అభ్యంతరములు వస్తూ ఉంటవి. ఆరోగ్య స్థితి కూడా అంతంతమాత్రంగానే ఉంటుంది. ఇతరుల వ్యవహారాలు సర్దుబాటు చెయ్యటం వంటి బాధ్యతలు జాస్తి కావచ్చు. దైవకార్యాలలో పాల్గొంటారు. ధనసంబంధమైన చిక్కులు సామా న్యంగా వస్తూఉంటవి. అయినా నిబ్బరంతో సమ యానుకూలంగా సర్దుకోగలుగుతారు. వ్యవహార రంగములో మీరే కొంతవరకు తగ్గిఉండటం అవ సరం. మీ క్రింద పనిచేసేవారు మీ ప్రస్తుతం మీ చెప్పుచేతలలో ఉండకపోవచ్చు. చూచీ చూడ నట్లు పనులు జరుపుకొనండి. ముఖ్యంగా ధన సహాయంతోనే జరుగవలసిన కార్యక్రమములు ఏవీ తలపెట్టడం మంచిదికాదు. ప్రయాణాలు చేయవలసిన అవసరం కలుగుతుంది. 4, 5 తేదు లలో స్నేహితులవలన సహాయం, ఆదాయ వృద్ధి.

* * *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ఈ వారంలో శత్రుబాధ క్రమంగా తగ్గు తుంది. సంఘంలో మీ మాటకు గౌరవం లభి స్తుంది. ఆదాయం మామూలుగా ఉంటుంది.. అపకారం జరుగవచ్చును అనుకొనే లావాదేవీలలో అకస్మాత్తుగా అనుకూలత కనుపిస్తుంది. సాధార ణంగా ప్రసంగాలలో తొందరపడటంవలన వృథా ఖర్చులు, కొన్ని సమయాలలో అపవాదులు కూడా వచ్చే అవకాశాలు ఉన్నవి. మీ స్వంత కార్యక్రమాల మీద శ్రద్ధ, జాగ్రత్త చూపవలసిన సమయం. ఆత్మీయులను గురించి ఉద్రేకము, సందేహము కలుగతగిన వార్తలు తెలున్నవి. శుభకార్య ప్రయ త్నాలు అనుకూలించే సమయంలో ఆటంకాలు రాగలవు. మీ నిదానంవల్ల ఇతరులకు శ్రమ కలుగుతుంది. 3, 4 లలో గౌరవం, ధనలాభం.

* * *




**దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి**

### మిథునం :

**(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఈ సమయంలో దైవబలం బాగున్నది. మీరు ఎక్కడకు వెళ్ళినా ఏ కార్యములలో ప్రవేశించినా ఆదరించి సహాయం చేసేవారు లభిస్తారు. ఒకా నొక సందర్భములో కలతలు కనుపించి వెంటనే సమసిపోతవి. ఆదాయం పెరుగుతుంది. దైవిక, ఆధ్యాత్మిక విషయాలమీద ఆసక్తి కలుగుతుంది. వ్యాపార వ్యవహారాది విషయాలలో అనుకూలమైన కాలమే. కాని, మీ ప్రయత్నం విశేషంగా అవ సరం. ముందు ఎప్పుడో జరుగతగిన భారీ కార్య క్రమాల నిమిత్తము మీ శక్తిని ఉపయోగించి తాత్కాలిక విషయాలమీద శ్రద్ధ చూపలేక పోతారు. సంఘ కార్యాలలో సుఖం కాని, ప్రయో జనం కాని తక్కువ అని చెప్పవచ్చు. 2, 3 లలో కార్యసిద్ధి, ధనలాభం.

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

ఏవేవో ఆలోచనలు పెట్టుకొని అసలు విష యాలను మరచిపోతూ ఉంటారు. మీ దేహా రోగ్యము గురించి శ్రద్ధగా ఉండండి. ఈ సమ యంలో డబ్బు ఒత్తిడి ఎక్కువ అవుతుంది. అయితే బాహ్య విషయాలలో పేరు ప్రతిష్ఠ, ఆడంబరం వీటికి లోపం ఉండదు. వాహనాలు ఎక్కే సందర్భాలలో జాగ్రత్తగా ఉండటం అవ సరం. నిదానంగా కాలం కలసివస్తుంది. సాధ్య మైనంతవరకు సామ, దాన పద్ధతులతోనే ముందుకు సాగడానికి ప్రయత్నించండి. వస్త్రాలంకారాలు మొదలైనవి కొనే అవకాశా లున్నవి. మీ అభి వృద్ధికి సంబంధించిన క్రొత్త ప్రయత్నములు అంతగా రాణించవు. 1, 2 తేదులలో స్నేహిత లతో స్పర్థలు, పడమర దిశనుండి శుభవార్త.

## ఈ వారము ధరలు

పసుపుకు గిరాకీ వస్తుంది. నూనుల ధర పెరిగి మందీ వస్తుంది. ప్రత్తి ధర మందీలో నిలుస్తుంది. అపరాల ధరలలో కొద్ది మందీ వచ్చినా తిరిగి యథాస్థితిలో నిలుస్తుంది. చింతపండు, బెల్లంధరలు కొద్దిగా పెరుగు తవి.

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

ప్రస్తుతం మీ కుటుంబ, ధన పరిస్థితులు ఒక సమయంలో ఉన్నట్లు మరొక సమయంలో కనిపించవు. వృత్తిని సంబంధించిన పనులు విసుగు దలతో ఏదో ఒక విధంగా నెరవేర్చ గలుగుతారు. సాధారణంగా ఎదటివారి అభిప్రాయాలను తెలుసు కొనిపోతూ ఉండటం అవసరం. ఏ వ్యవహారంలో దిగినా ఆరంభంలో పోటీ కనిపిస్తూ ఉంటుంది. ఈ వారం రెండవ భాగంలో దైనికంగా పరిస్థితు లలో మంచి మార్పు గోచరిస్తుంది. మిమ్ములను అలజడి పెడుతున్న సమస్యలు చల్లగా తొలగి పోతవి. ధైర్యంతో మీ మార్గాన్ని సరిచేసుకో గలుగుతారు. స్నేహితులవల్ల మంచిమాట వింటారు. 30, 31 లలో స్థిమితంలేని ఆలోచ నలు, పనులయందు అశ్రద్ధ.

* * *

### కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

స్థిమితంగా జరిగే సమయమే. కాగా ఇతరుల మాటలు మిమ్ములను ఆశ పెట్టవచ్చు. వృత్తి ఉద్యోగాలలో విశేషంగా పని, అందుకు తగినట్లు ఫలితం ఉంటవి. బాధ్యతతో కూడిన పనులు పెరి గిలా జయప్రదంగా నిర్వహించ గలుగుతారు. మాన సిక ఆందోళన తగ్గిపోతుంది. మీ ఆరోగ్యం కూడా ఇంతకు ముందుకన్నా బాగుంటుంది. కుటుంబ సమస్యలలో ఎదటివారిని నొప్పించవలసిన అవ సరం రాకుండా చూచుకొనండి. పెద్దలతో మైత్రి లభిస్తుంది. విద్యారంగంలో ఆసక్తి, అవకాశము లభించే సమయం. ఒకానొక సమ యంలో మిమ్ములను నమ్మించి మోసము చేసే వారు తటస్థపడతారు. 31, 1 లలో సంతోష వార్తలు, మంచి స్నేహితులు లభిస్తారు.

* * *

### తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

గౌరవప్రదమైన సమయం. పైకి అన్ని హంగులు బాగుంటవి. వచ్చే ఆదాయం చేసే ఖర్చూ రెండూ విశేషంగానే ఉంటవి. ఇతరుల












# వారఫలాలు

వలన భారం పెరిగే అవకాశాలున్నవి. ముందుగా ఏవిధమైన వాగ్దానాలు చేయటం మంచిదికాదు. ప్రయాణ సూచన లున్నవి. ప్రస్తుతం సహాయం చేస్తామన్నవారు ముందుకు రాలేక పోతారు. వృత్తి, వ్యాపారాలలో తిరుబాటు అనేది ఉండదు. ఆస్తి వృద్ధి ప్రయత్నాలలో మధ్య మధ్య ఆటంకాలు ఏర్పడ్తూ చివరకు అనుకూలిస్తవి. ఎంత శ్రమ కని పించినా ఆరంభించిన పనిని పట్టుదలతో పూర్తి చేయ గలుగుతారు. పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండటం అవసరం. 1, 2 లలో దైవ కార్యాలు, కొత్తవారి స్నేహం.

*　　　*　　　*

## వృశ్చికం:

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

ప్రతి పనీ మీరు అనుకొన్నట్లే జరుగలేదని అనుకోవద్దు. మధ్యలో కొన్ని మార్పులు జరిగే సమయం. అయితే మొత్తంమీద ఫలితం అను కూలంగా ఉంటుంది. ధనాదాయం పెరుగు తుంది. ఇంతకుముందు మిమ్ములను అనుసరించి ఉన్నవారు మీ విరోధులతో చేయి కలుపవచ్చు. కాని మీ స్థితికి ఏవిధంగానూ లోటు కనుపిం చదు. అనుకూలమైన ప్రయాణాలు చేస్తారు. మీ ఆరోగ్యం ఇంతకుముందు కన్నా మేలుగా ఉంటుంది. సంఘ కార్యాలలో పాల్గొంటారు. అన్ని విషయాం లోను మీ మాటను ప్రోత్సహిస్తూ మీకు తోడుగా నిలచేవారు లభిస్తారు. మిమ్ములను భయపెట్టే వార్తలు తెలియవచ్చు. నమ్మవద్దు. 3, 4 లలో ప్రయాణ సూచనలు.

*　　　*　　　*

## ధనుస్సు:

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఈ వారం దైవ బలం బాగున్నది. ఒక సమ యంలో మీరు ఎంత చికాకు పడినా ప్రస్తుతం అన్ని విధాలా జయం పొంద గలుగుతారు. సుఖము, శాంతి బాగుంటవి. కుటుంబంలో సంతోషంగా గడచిపోతుంది. క్రొత్త మనుష్యులతో చేరి విశే షంగా ప్రయోజనం పొందగలమనే ఆశల పెట్టు కొనవద్దు. స్వయంకృషితో పనిచేసినా క్రమంగా జరిగి పేరు, ఫలితం లభిస్తవి. అసూయా స్వభావం కల వ్యక్తులు తటస్థపడతారు. అయితే ప్రసంగాలు విరసంగా మారకుండా చూచుకొనండి. మొత్తంమీద ప్రతి సందర్భంలోనూ జాగ్రత్తగా ఉండటం ముఖ్యం. 3, 4 తేదీలలో సంతోష వార్తలు, సుఖం నిమిత్తం ఖర్చులు.

*　　　*　　　*

## మకరం:

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

కష్టపడి పనిచేయవలసిన సమయం. ఫలితం వెంటనే చేతికి రాకపోవచ్చు. ఒకదాని కొకటి సంబంధం లేకుండా కార్యభారం పెరుగుతూ ఉంటుంది. కొన్ని సమయాలలో ఫలితం కనిపి స్తున్నా ధైర్యం చేయలేక పోతారు. అయినా మిమ్ములను ప్రోత్సహించి ముందుకు తీసుకువెళ్ళే

స్నేహితులు లభిస్తారు. కొంతవరకు వలితం కూడా బాగుంటుంది. కుటుంబంలోని అసౌఖ్యము, ఆందోళన తొలగిపోతవి. సాధారణంగా మీ వ్రాతలలో పొరపాట్లు దొర్లకుండా చూచుకొనండి. భారీ కార్యక్రమాలు ప్రారంభించవద్దు. మీ ఆరోగ్యం కాపాడుకొనండి. 4, 5 లలో ధనలాభం, క్రొత్త వారితో స్నేహం.

* * *

**కుంభం :**

**(ధనిష 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

సంతోషదాయకమైన సమయం. మీ ఆర్థిక స్థితి బాగుంటుంది. పరిస్థితులను అర్థంచేసుకొని వ్యవహారాలను సాగించ గలుగుతారు. సంఘ కార్యాలలో శ్రమ ఉంటుంది. కాని గొప్పతనం లభిస్తుంది. కుటుంబంలో శుభకార్యాలు నెరవేరుతవి. ఇతరులకు మీ సలహా చక్కగా లభిస్తుంది. బాగా ఖర్చు సమయమే. కాని ఈశ్వరానుగ్రహంవల్ల లోటు కనుపించదు. ఒక్కొక్క సమయంలో ఆందోళన కలిగినా మీరే ధైర్యం తచ్చుకుని కార్యములను కొనసాగించ కలుగుతారు. అధికారులవలన కొంతవరకు అనుకూలత పొందగలుగుతారు. 30 31 లలో మానసిక ఆందోళన, లాభకరమైన పనులు, గౌరవం.

* * *

**మీనం :**

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

మీ అభిప్రాయాలకు తగినట్లుగా అవకాశం లభిస్తుంది. కోర్టు కచేరీలలో అనుకూలమైన సమయం. వ్యాపారాలవంటి వాటిలో ఫలితం బాగుంటుంది. ఈ సమయంలో మీరు నెరవేర్చవలసిన ప్రతి పనినీ జ్ఞాపకము పెట్టుకొనలేక పోతారు. ప్రయాణాలు ఆగిపోయే అవకాశాలున్నవి. మీవల్ల సహాయం పొందినవారు మిమ్ములను వెక్కిరించటానికి సిద్ధ మవుతారు. అందువల్ల మీకు వచ్చే కష్ట నష్టాలు ఏమీ ఉండవు వారం మధ్యలో కొంచెం అనారోగ్యం చేసి వెంటనే స్వస్థత లభిస్తుంది. కుటుంబ ఖర్చులు అధికంగా కనుపిస్తవి. కుటుంబంలో మీరు అనుకునే పనులు అంత సులభంగా పూర్తికావు. కొత్త ప్రయత్నాలు కలసిరావు. 31, 1 తేదులలో వృత్తిలో ప్రోత్సాహం, ధర్మకార్యాలు. ★

---

# పయనించిన మరణం

25 వ పేజీ తరువాయి

వికరంగా పోల్చుకుంటేగాని, ఎవర్నో చూశానని చెప్తే, అది ఒక అమాయకుడి మీదకు మళ్ళచ్చు" అన్నాడు.

"అలా అన్నారు బాగుంది. చట్టానికి వ్యతిరేకులు కానివారు ఒకవేళ ఇరుక్కున్నా, వారిని నిర్దోషులు గా బుజువుచేసి, వదిలేస్తాం. అంతే గాని, దొరికిన వారినందర్నీ వురికంబాని కెక్కించడం మా పనికాదు. జరిగినది వివరంగా చెప్పండి" అన్నాను.

"ఐతే వినండి" అంటూ ప్రారంభించాడు.

"—ఐతే వినండి. లోగడనే చెప్పనే చెప్పాను. ఆమెతో ఎవరు వెళ్ళారో నా కంతగా గుర్తు లేదు. కానీ, డానా నాకు సిగరెట్లు కొనడానికి బయల్దేరి వెళ్లేముందు రెడ్ అనే అతనితో మాట్లాడడం చూశాను. రెడ్ చాలాసేపు అటూ, ఇటూ పచార్లు చేశాడు. అలాని, ఆమె రెడ్ కలిసి వెళ్ళడం మాత్రం నేను చూడలేదు. కానీ......బహుశా......" అంటూ నసిగాడు.

ఈ ముఖ పరిచయంలేని పేర్లతో నాకు వెర్రెత్తి, "ఐతే ఆ రెడ్ ఎవడు?" అన్నాను.

"రెడ్ ఎవరో గుర్తు లేదు? అతను—రెడ్ బెల్లోజు! అతనే ఆ క్రూర మృగ సంరక్షకుడు విన్సెంట్‌తోపాటే అతన్ని—డానాలీ, షెరాన్ కలుసుకున్నారు" అంటూ ఫూలరే నాకు గుర్తు చేశాడు

నాకు గుర్తు వచ్చింది. అవును. వెంటనే అతన్ని రప్పించమని చెప్పాను.

బద్ధకంగా ఆవులించుకుంటూ, అతి నీరసంగా రెడ్ ప్రవేశించాడు. బహుశా బద్ధకం అతని జన్మహక్కు అయి ఉండాలనుకున్నాను. ఈడుస్తూ నడవడం, ఏడుస్తూ మాట్లాడడం, బహుశా మరీ తక్కువగా ఆలోచనాశక్తి కలిగి ఉండడం అతనికి అలంకారాలై యుండచ్చు.

"ఆమె నాతో రోజుల తరబడిలేదు. ఒక్కసారి వచ్చింది. అదైనా విన్సెంట్ షూటింగ్ గ్యాలరీలోనే కలిశాను" అన్నాడు. ఆనక తన యజమాని వైపు తిరిగి, "ఏమండీ, ఐదింటికి నే నెక్కడున్నాను? గుర్రాలకు దాణా పెడుతున్నాను. అవునా? ఏడు గంటల ప్రదర్శనానికి సిద్ధం చెయ్యవలసిన గుర్రాలను సిద్ధం చేస్తున్నాను. అవునా" అన్నాడు.

ఈ రకమైన మాటల పరంపరవల్ల తేలే విషయం ఏమీ ఉండదు. వాళ్ళంతా ఒకే గుంపు వారిలో ఎవర నేరం చేసినా సరే. అది బస్తే పైకి రానీరు. తొక్కి, నటి దొంగ సాక్ష్యాలు చెప్తారు. అసలు వాళ్ళల్లో హత్య చేసిన దెవరో తెలియక పోవచ్చు. కానీ, ఏ విధమైన ఉపయోగకరమైన వివరాలూ ఇవ్వరు.

కనుక ఈ పద్ధతి వదిలేసి, 'ఆ' టైరు గుర్తులు గల టైరుగల కారు వెతికితే మంచి దనిపించింది. వెంటనే ప్రారంభించాము. అన్ని కార్లూ చూశాము. చిట్ట చివరనున్న ఓ వేగన్ ముందు టైరు మా 'గుర్తు'కు సరిపోయింది. కానీ, టైరు గుర్తు తేలినంత మాత్రాన హంతకుడు దొరికినట్టు కాదు. అదృష్టవశాత్తు నా కంటికి ఒక వివరం కనబడింది. ఆ వాగన్‌కి పక్కవైపు ఎక్కే బల్లమీద ఒక పాదరక్ష ముద్ర నన్నాకర్షించింది. ఆ ముద్ర టెన్నిస్ బూటు ముద్ర—కాలికీ, మడమకీ ఎదల తేడా లేకుండా అంతా బల్లపరుపుగావుంది. ఇదే రకం 'డైమన్ సౌసస్' బూటు డానాలీ ధరించినట్లునా గుర్తుంది.

ఫూలర్ని నెమ్మదిగా పిలిచి, "ఇదిగో ఈ బూటు ముద్ర చూడండి. డానాలీ వేసుకున్న బూటు 'ముద్ర లా వుండేమోనని నా అనుమానం బహుశా పోట్లాట సమయంలోనో, పెనుగులాట సమయంలోనో పడుండచ్చు. కనుక డానా బూటు తెప్పించి, కొలతలు సరిపోయాయేమో చూడాలి. ఈ పద్ధతిలో కొంత ఉపయోగం ఉండచ్చు" అన్నాను. వెంటనే డానాలీ బూటుకోసం క్యాస్పెల్ తంతి ఇచ్చాము.

మేమా తంతికి సమాధానంకోసం నిరీక్షిస్తుండగా ఆ వాగన్ సొంతదారులు, కింక్జైన్ దంపతులు వచ్చారు. కులాసాగా, ఆనందంగా నవ్వుకుంటూ వచ్చారు. కాని, ఇంతకన్నా కులాసాగా, ఆనందంగా నవ్వే హంతకుల్ని నేను చాలా మందిని చూశాను

"మీరు మాట్లాడే ప్రతీ అక్షరం పోలీసులు నిశరమైన సాక్ష్యంగా తీసుకుంటారు. ఆ సంగతి మీరు తెలుసుకునీ మాట్లాడితే మంచిది" అని ఫూలర్ రివాజుగా హెచ్చరించాడు.

ఆ మాట విని కింక్జైన్ నోరు తెరచి అట్టే ఉండిపోయాడు. పాపీ డెర్క్‌నిచూసి హడ లెత్తిన వాడిలా కొయ్యబారిపోయాడు. అతని భార్య చెంగున గంతేసి, అతని చెయ్యి పట్టుకుంది.

"ఏమిటీమీ రనేది? మీకేమైనా వెర్రా చాదస్తమా? మే మేపాపమూ ఎరుగం. ఆ పిల్ల ముక్కూ, ముఖం కూడా మాకు తెలీదు. ఒకే ఒక్కసారి చూశాం. అదైనా చాలా దూరంనుంచే! ఇంతకీ మేం చూసిన అమ్మాయి మీరనుకున్న అమ్మాయి ఒకరో కాదో కూడా మాకు తెలీదు" అన్నాడు తేరుకుని.

"మిస్టర్ కింక్జైడ్! మీ కారు టైరూ, ఆ ప్రాంతానికి వచ్చిన కారు టైరూ ఒకటే అని మేము గుర్తించాము. దానికి మీరేం సంజాయిషీ చెప్పుకుంటారు" అన్నాను నేను.

"భలేగావుంది. ఆ కారు టైర్లవంటి టైరులుగల కార్ల యజమానులంతా హంతకులే అన్నమాట! అలాటి పేర్లు వేలకు వేలుంటాయి. ఈ రకంగామీరు అనుమానించడంలో అర్థం లేదు" అన్నాడు పుంజుకుని.

"అవును నిజమే! కాని, ఇంకో ముద్ర కూడా ఉంది. మీ వేగన్ పక్కవైపు ఎక్కే మెట్టుమీద డానాలీ కాలిబూటు ముద్ర ఉంది. దానికేమంటారు?"

అతని భార్య ఉన్నట్టుండి పక్కనున్న ఖాళీ కుర్చీలో పడిపోయింది. అతని ముఖం జేవురించింది. నోరు చప్పరించాడు. కానీ, మాట పెగల్లేదు కాస్సేపలా మూగగా నోరు మెదిపి, ఆనక "య్యాయ్" అని అరిచి, "ఏదీ చూపించండి. నేను నమ్మను' అన్నాడు.

"అదలా ఉంచండి. మీ ఆట ఎప్పుడయిపోయింది?" అన్నాను.

మాట్లాడలేక అవస్థ పడుతున్న కింక్జైడ్‌కి బదులు సర్కస్ మేనేజర్ బర్ట్ రోసాల్డ్ కలగజేసుకుని, ఐదింటికి" అని చెప్పాడు.

"ఆనక ఏం చేశారు?"

'ఇది జరిగి వారం అయ్యింది. అంతగా గుర్తులేదు. కానీ, ఆటయ్యాక రివాజుగా స్నానం చెయ్యడానికి వెళ్లాను" అన్నాడు కింక్జైడ్

"అవును నిజం. మే మిద్దరం కలిసే వెళ్ళాం" అది అతని భార్య కుర్చీలో కదులుతూ.

భార్య ఎప్పుడూ భర్తకి వంత పాట పాడాలి. ఇదో రకం సాక్ష్యం అనుకున్నాను నేను.

"మేం చాలా గౌరవ మర్యాదలున్న వాళ్ళం. వో పన్నెండేళ పిల్లని చంపే అవసరం మాకేం లేదు అవును లేనే లేదు" అందావె తిరిగి.

ఇంతలో కింక్జైడ్ భార్య ముఖం మెదిసింది.

# పయనించిన మరణం

"ఐదింటినుంచి మేమిక్కడే ఉన్నట్లు నేను నిరూపించగలను" అందామె సవాలు చేసినట్లుగా.

మేం మామె కేసి చూశాము.

"ఆ రాత్రి బార్నీమామ పుట్టిన రోజు. అతనికి చెప్పకుండా ఆశ్చర్య పరిచి పార్టీ ఇచ్చాము" అని భర్త కేసి తిరిగి, "మీకు గుర్తు లేదూ" అంది.

కింక్హెడ్ ముఖం విప్పారింది. "ఔనౌను మనమేకాదు. సర్కస్‌లో ప్రతివారూ హాజరయ్యారు. చిన్న ఎడ్డీ, పెద్ద ఎడ్డీ, వ్యాయామం చేసే వాళ్ళు ముఠా అంతా కూడా వచ్చారు. తలుపులోంచి లోపలకు పట్టకపోయినా, గోటీవచ్చి, తన లావుపాటి శరీరాన్ని తలుపవతలే పెట్టుకు ఆనందించింది. వాళ నందర్నీ అడగండి. ఎవరైనా చెప్తారు" అన్నాడు.

"పార్టీలో మీరంతా ఎంతసే పున్నారు?" అన్నాను.

"ఆరున్నరకి వంటవాడు భోజనానికి రమ్మనే వరకూ ఉన్నాము. అంతా కలిసి, తిని ఏడు గంటల ఆటకు సిద్ధమయ్యాము."

అదే విషయాన్ని అంతా బలపరిచారు. ఆ 'బార్నీ మామ' పుట్టినరోజు ఆ శనివారమే అయినట్లు అతని సర్టిఫికట్లు చూసి, తేల్చుకున్నాము. మళ్ళీ మా కథ మొదటికి వచ్చింది. కానీ, ఆ బూటు ముద్ర మాత్రం కొంత విషయం కలిగి ఉంటుందని నమ్మకం వుంది. క్వెన్సెల్‌నుంచి ఏ విషయం రాలేదు. (బూటు పంపనే లేదు)

నేను కింక్హెడ్ దగ్గరగా వెళ్ళి, "మిస్టర్ కింక్హెడ్! మీరు చెప్పిన విషయాలన్నీ ఒప్పుకుంటున్నాను. ఆనాటిరాత్రి మీ వేగన్‌లో మీరు బయటికి ఎక్కడికి వెళ్ళలేదనే అనుకుందాం కాని, మీ వేగన్ మరెవరైనా ఉపయోగించే అవకాశం ఉందా?" అన్నాను.

"లేదు ముమ్మాటికి లేదు. కారుకి తాళం వేయకుండా నేనెప్పుడూ వదల్ను" అన్నాడు.

"మీ రన్నది నిజంకాదు. మేము మీ కారును చూసినప్పుడు దానికి తాళంలేదు"

"తాళం వేస్తానంటే కారుకి వేస్తాననికాదు. ఇగ్నిషన్ తాళం వేస్తానని అర్థం. కనుక నా వాగన్ ఎవడైనా తీసుకెళ్ళాలంటే నన్నడిగి, తాళం తీసుకు వెళ్ళి తీరాలి."

"అహా! మీ జంతువుల నన్ని రెడ్ జాగ్రత్తగా చూస్తాడా?" అన్నాను విషయం మారుస్తూ.

కింక్హెడ్ ఆ విషయం పసిగట్టి, "ఆహా" "కుక్కల్నీ, గుర్రాలనీ, తదితర జంతువుల్నీ చూస్తాడు. కానీ అతనికి కారు నడపడం రాదు" అన్నాడు.

ఏవేవో కలలు కంటున్న వాడిలా కూర్చున్న బర్ట్ రేనాల్ట్స్ ఉన్నట్టుండి, "పార్టీకి రెడ్ తీసుకు వచ్చిన సారాసీసా ఎక్కడిది?" అని అడిగాడు కింక్హెడ్‌ని ఉద్దేశించి.

నార్మన్ కింక్హెడ్ క్షణం ఆలోచించి, "ఔను. కారు ఒకళ్ళ కిచ్చాను. కాని, రెడ్‌కి మాత్రం కాదు. కార్ల్ విన్సెంట్ కిచ్చాను. లిక్కర్ (సారా) కొనడానికి తను ఊళ్ళోకి వెళ్ళాలనీ, నా కారిమ్మని అడిగాడు. పనయ్యాక తాళం **రెడ్‌చేత** పంపిం

డానా. అది మధ్యలో వచ్చి తాళం అడిగి, తీసుకున్నాడు'' అని చెప్పాడు.

నాకూ అది నిజమేననిపించింది.

నేనూ, ఫూలర్ కలిసి కార్కి విన్సెంట్ గుడారానికి వెళ్ళాను. వెళుతూనే అతన్ని హంతకుడుగాఎంచి, దుమ్మెత్తి పోశాను.

''మీకు పిచ్చెక్కింది. తాళాలు రెడ్ కిచ్చాను'' అని అతను అరిచాడు.

''అవును. ఆమెను చంపిన తరువాత ఇచ్చావు''

''అది మీరు నిరూపించలేరు.''

''అంత త్వరపడకండి పాపం. మేం చెయ్యలేనిది లేదు. డానాని ఐదు దాటాక చూడనే లేదన్నారు. కాని, ఆమెకు అరవై సెంట్లు ఇచ్చారు. ఔనా?''

''ఔను''

''ఆరింటికి తిరిగి వచ్చా నన్నారు ఔనా?''

''ఔను''

''అక్కడే అబద్ధం ఆడుతున్నారు. ఆరింటికి తిరిగి వచ్చా నన్నారు. అది నిజమే! కాని, లిక్కర్ (సారా) తీసుకు రాడానికి వెళ్ళినప్పుడు డానాని కూడా తీసుకు వెళ్ళారు. దారి మధ్యలో ఆమెను బలాత్కరించారు. బహుశా ఆమె మీ ఆటలు సాగ నివ్వక, తన తలి దండ్రులతో చెప్తానని బెదిరించి ఉండచ్చు. ఆ పెనుగులాటలో ఆమెను చంపి ఉంటారు. ఔనా,??'' అన్నాను.

అతన్ని మాట్లాడనివ్వకుండా, తిరిగి ప్రారంభించాను. ''డానా తన చేతిలో డబ్బున్నంత కాలం ఎవ్వరితోను ఆ సర్కస్ స్థలం వదలదు—ఒక్క మీతో తప్ప. మీరు చూడ ముచ్చటగావుండి, పెద్ద మనిషిలా కనుపిస్తే—స్నేహితునిగాఎంచి మీ మాట నమ్మింది. ఫలితం! మీ చేతిలో తన ప్రాణాల కోల్పోయింది. కాని, కారు పక్క పలకమీద మాత్రం ఆమె కాలి బూటు ముద్ర మిగిలి పోయింది' అన్నాను.

అంతే! మారు మాట్లాడ నివ్వకుండా, కార్కి విన్సెంట్‌ని అరెస్టు చేశాము. అతను చెప్పిన ప్రతీ మాటా కూడా అతనికి విరుద్ధంగా, మాకు సాక్ష్యంగా తయారయ్యింది. అతని చొక్కామీద చాలా సూక్ష్మమైన రక్తపు మరక లున్నాయని వాన్‌కావర్ ప్రయోగశాల నిర్ణయించింది వేగన్ మీది బూటు ముద్ర, డానాలీ తొడుక్కున్న టెన్నీసు బూటు ముద్ర సరిపోయింది. బ్రిటిష్ కొలంబియా యూనివర్శిటీకి చెందిన వృక్ష శాస్త్రజ్ఞుడు డాక్టర్ థామస్ టైలర్—డానాలీ శవం దొరికిన చోటులో ఉన్నా మొక్కా మోడులతో వాగన్‌లోవున్న ఆకుల ముక్కలు పోల్చి, అవీ ఇవీ ఒకటిని తేల్చి చెప్పాడు. మొక్కల విత్తనాల వగైరా వేగన్‌లో దొరికాయి.

1954, జూన్ 24 వ తేదీన కార్కి విన్సెంట్‌ని అపరాధిగా నిరూపించారు.

మొదటిసారి జరిగిన విచారణలో కొన్ని స్వల్ప లోపా లుండడంవల్ల విన్సెంట్ సుప్రీం కోర్టు వారి మాట మీద ''బ్రిటిష్ కొలంబియా'' అప్పీల్ కోర్టులో తిరిగి 'రెండో' విచారణ'కి అనుమతి పొందాడు. డానా ఆనాడు (శనివారం) రాత్రి తొమ్మిదింటివరకూ బ్రతికే ఉందని అతని తరపున వకీలు నిరూపించ చూచాడు. దానివల్ల 'మూడో విచారణ' వరకూ వెళ్ళింది.

1955 ఫిబ్రవరి 19 వ తేదీన ఆరుగురు జ్యూరీలు అతనికి మరణ శిక్ష విధించారు. విన్సెంట్ 1955 ఏప్రియల్ 27 వ తేదీన ఒక అర్జీ పెట్టుకున్నాడు. కానీ, అది ఆదరణ పొందలేదు.

1955 జూన్ 14 వ తేదీన కార్కి విన్సెంట్ గిలగిల తన్నుకుని (ఉరి కంబంమీద) ప్రాణాలు వదిలాడు.



నాకు అనవసరంగా కోపం తెప్పి స్తున్నవ్!".

"అన్నయ్యా, నువ్వు నీ దేశం సంగతే మర్చిపోయావు. నీకు కలిగే అపాయం నీకే తెలీదు. ఆలోచించే చేశాను ఈ పని!"

అదే సమయంలో వారిని చూసిన పియత్రనెరా మనుష్యులు గుర్రాలు ఎక్కి వారిని వేగంగా సమీ పించారు.

"ఆర్సెఆంటన్, చిరంజీవిగా వర్థిల్లు!" అని అరిచాడు తెల్లని గడ్డంకల ఒక ముసలివాడు. అంత ఎండలోనూ ఒక శిరోరక్ష, శాలువ ధరించి ఉన్నాడు. ఈ శాలువ అతని గుర్రం చర్మంకన్నా మందంగా ఉందేమో, కూడా! "అంతా తండ్రి పోలికలే; కొంచెం బడ్డా పొడుకూ ఎక్కువ, అంతే! ఎంత చక్కటి తుపాకీ! దీన్ని గురించి నా కెవరూ చెప్పలేదే!"

"ఆర్సెఆంటన్ చిరంజీవిగా వర్థిల్లాలి!" అని అరిచాడు అందరూ. "చివరికిఅంతా జరగవలసినట్లే జరుగు తుందని మాకు తెలుసు!"

"ఆహా! ఆర్సెఆంటనే!" అన్నాడు ఎండకి ఎర్రగా ముఖం కాలినట్లు ఉన్న ఒకవ్యక్తి "నిన్నె ఇక్కడ ఆహ్వానించేందుకు మీ తండ్రి ఉండిఉంటే ఎంత బాగుండేది! ఎంత మంచివాడు! నామాటే విని ఉంటే, నేను చెప్పింది నమ్మిఉంటే జ్యాడిస్ వ్యవహారం......చాలా ధైర్యశాలి! నేను చెప్పింది నిజమని తెలిసి కూడ నామాట వినలేదేమో!"

"బాగుంది!" అన్నాడు ముసలి వాడు. "ఇంత కాలం ఆగినంత మాత్రాన జ్యాడిస్ వ్యవహారం ఏమీ మునిగిపోయే స్థితికి రాలేదు."

ఆర్సో అంత ఉల్లాసంగా లేడేమో

## కొలంబా

21 వ పేజీ తరువాయి

ఈ అశ్వదళం మధ్య నుంచుని ఒక్కొక్కరూ అతనితో కరచాలనం చేస్తూఉంటే ఏదీ సరిగ్గా విని అర్థం చేసుకొనలేక పోయాడు. చివరికి, తను సైన్యంలో తన దళం వారిని మందలించి నప్పుడు వాడే స్వరంలో అన్నాడు.

"మీరు ప్రేమాభి మానాలకి కృతజ్ఞుడిని కాని, ఏమి చెయ్యాలో వివరంగా చెప్పకండి! నేను చెయ్య వలసిందేమిటో నాకు తెలుసు!"

"నిజమే, నిజమే!" అని అరిచారు తక్కినవారు.

"ప్రపంచంలో చాలామంది అప్రయోజకులుంటారు!" ఓ ఉపన్యాసకుడు మళ్లీ అందుకో బోయాడు.

"అక్షరాల నిజం!" అన్నది అరగంట నుంచి ఆ ఉపన్యాసం వింటూన్న ఓ గొంతుక.

పాప (తెనాలి).

"మా అందరి బలమూ నీవైపే అని తెలుసుగా!"

"తెలుసు. కాని ఇప్పుడు ఏదీ అవసరంలేదు. మా ఇంట్లోకూడా ఏ ప్రమాదమూ లేదుకదా, ఇప్పుడు! పియత్రనెరా పోయేదారి నాకు తెలుసు. అంగరక్షకులు, మార్గ దర్శకులు అనవసరం."

"భయపడకు ఆర్సెఆంటన్," అన్నాడు ముసలివాడు మళ్లీ.

"వాళ్ళు ఇవాళ బయటికిరారు. గండుపిల్లి బయటికొస్తే ఎలుకలు దాక్కుంటాయిగా!"

"నువ్వే గండుపిల్లివి, ముసలి తెల్లగడ్డం!" అన్నాడు ఆర్సో "నీపేరేమిటి ?"

"ఏమిటి! నేనెవరో నీకు తెలీదా, ఆర్సో ఆంటన్ ? నిన్ను ఎన్నిసార్లు ఎక్కించుకు తిరిగాను ? పోలోగ్రిఫో నీకు తెలీదా ? దేహం, ఆత్మకూడా డెల్లారెబ్బియావే! ఒక్కమాట చెప్పు, నీ పెద్ద తుపాకితోపాటు నా పాత తుపాకూడ మోగుతుంది. నన్నూ లెక్క వేసుకో ఆర్సెఆంటన్."

"సరే, సరే—కాని ఇదేమిటి, మమ్మల్ని కదలనివ్వరు, మీరూ తప్పుకోరే!"

అందరూ బయలుదేరారు. వేగం గానే ఊరివైపు వెళ్లారు. అయితే, మధ్యమధ్య ఆగి తమదారిని కాసేవా రెవరయినా ఉన్నారేమో, అని పరిసరాలని పరీక్షించేవారు. ఆర్సో, అతని చెల్లెలు ఏ అపాయానికి గురి అవుతారో అని వారిని కాపాడేందు కన్నట్లు దగ్గరగానే ఉంటూ ఉండే వారు. ముసలిపోలోగ్రిఫో తన అను చరులతో; "నాకు అంతా అర్థం అయింది! ఏంచేస్తాడో మనకి చెప్పడు కాని తను చేసేదిమాత్రం చేస్తాడు. అంతా తండ్రి పోలికే! సర్లెండి! ఎవరి సహాయం అక్కర్లేదా ? సెయింట్ నెగాకి మొక్కుకున్నాడ ? (ఈ సెయింట్ -అంటే పుణ్యపురుషు డి-కి మొక్కుకుంటే ఉద్దేశంబయటికి తెలియకుండా మనస్సు లోపలే దాచుకోలాలిట-అ॥) మంచిదే!..." అన్నాడు. ఇంకా ఏమిటేమిటో చెప్పాడు.

ఈ దళం ముందురాగా, డెల్లా రెబ్బియా వంశీయుడు తన గ్రామం చేరుకున్నాడు. తరతరాలుగా కార్పొరల్ వంశంవారికి చెందిన భవనం ప్రవేశించాడు. రెబ్బియా పక్షంవారికి చాలాకాలంగా నాయ కుడు లేకుండా పోయాడేమో అతన్ని ఆహ్వానించటానికి గుమి కూడరు. తటస్థంగా ఉన్నవారు

తమతమ ఇళ్ళగడపలమీద నుంచుని అతన్ని చూస్తూ ఉండిపోయాడు బారిచినీ పక్షంవారు తమ గృహాలను వదిలి బయటికి రాకుండా కిటికీలలో నుంచే చూస్తూ ఉండిపోయారు.

ప్రియొత్రనెరా నిర్మాణం చాలా గజిబిజిగా ఉంటుంది. కార్సికన్ గ్రామాలే ఇంత. ఒకవీధి చూడాలంటే 'కార్గేస్' ఊరికి వెళ్ళవలసిందే, ఇళ్ళు ఒకవరస, అని లేకుండా ఇష్టంవచ్చినట్లు కట్టివేసేశారు. అన్నీ పీఠభూమివలె ఎత్తుగా ఉన్న ప్రదేశం మీద ఉంటాయి. ఈ ప్రదేశం పెద్ద కొండలపక్కనే ఉంటుంది కాబట్టి వీటికి దారితీసే మెట్లలో ఒకటా అనిపిస్తుంది. ఊరిమధ్య ఒక మహావృక్షం ఉంది. దీని పక్కన ఒక పెద్ద నీటితొట్టి. ఈతొట్టికి నీరు, గొట్టంద్వారా దగ్గరలోనే ఉన్న ఊటనుంచి వస్తాయి. దీనిని నిర్మించినవారు దెల్లా రెబ్బియా, బారిచినీవంశాలవారు ఇద్దరూకూడా. కాని ఇది వారి ఒకప్పటి మైత్రికి ఒక చిహ్నం అనుకోవటం పొరపాటే అవుతుంది. అసలు వారికి ఒకరికి ఒకరంటే ఉండే అసహ్యభావం సూచించేగుర్తు ఇది! దెల్లా అక్కడ ఒక 'ఫవుంటెన్' కట్టటానికి విరాళం ఇవ్వబోయాడు కాని బారిచినీ (న్యాయవాది వృత్తి అవలంబించిన వ్యక్తి) ఈవిషయమై అతనితో పోటీ పడ్డాడు. వీరి ఇద్దరిమధ్య పోటీవల్ల ఊరికి మంచినీటివసతి కలిగింది.

చెట్టుపక్కనే ఒక చిన్న బయలు ప్రదేశం ఉంది. ప్రతిసాయంత్రం పనిలేనివారంతా ఇక్కడ పోగవటం అలవాటు. ప్రతిసంవత్సరం ఇక్కడే ఒకఉత్సవం జరుగుతుంది. ఈచోటికి ఇరువైపులా రెండు ఇళ్లు చూడవచ్చు. ఇవి వైశాల్యం ఎక్కువ లేకపోయినా చాలాఎత్తుగా ఉంటాయి. కాని, ఒకవైపు ఇల్లు బారిచినీ పక్షంవారిది, మరొకవైపు ఇల్లు దెల్లా రెబ్బియా పక్షంవారిదీ అవటంవల్ల ఎవరు ఎక్కువ ఉన్నంతగా కట్టగలరా అన్న పోటీవచ్చి, ఇలా పైపైకి ఎదిగిపోయాయి; పోటీ మూలంగా రెండుకట్టడలు ఇంచుమించు ఒకటే ఎత్తుకూడా పెరిగాయి. ఇవి రెండూ రెండు పక్షంలవారి 'కోటలు' అనవచ్చు.

'కోట' పేరుకి తగినట్లుగానే ఉంటుంది వీటి నిర్మాణ పద్ధతి. ఉత్తరం వైపున ఉండేది దెల్లా రెబ్బియా పక్షంవారిది; దక్షిణం

---

ఇది ఇంగ్లాండులో జరిగిన సంగతి:

ఓ రాజుగారితో మాట్లాడుతూ విదూషకుడు "క్షమార్పణ కూడా అప్పుడప్పుడు అవమానం కన్న ఎక్కువబాధ కల్గిస్తుంది" అన్నాడు.

"నిరూపించలేకపోతే తల తీయిస్తా" నన్నాడు రాజుగారు.

ఆరోజు సాయంత్రం రాజుగారు ఉద్యానవనంలో ఉండగా విదూషకుడు అమాంతంవచ్చి రాజుగారి చేతిని ముద్దెట్టుకుని సమాధానంగా 'మహాప్రభూ! క్షమించాలి రాణీగారను కున్నాను' అని సమాధానం చెప్పాట్ట.

మందరం (మద్రాసు).

---

వైపుగా ఉండేది బారిచినీ పక్షంవారిది. వారివారి ఇళ్ళుకూడా ఆ, ఆ దిక్కుల వైపుగానే ఉన్నాయి. తన ఇల్లు చేరుకోవాలంటే ఆర్సో మేయర్ గృహం మీదుగానయినా పోవచ్చు, లేదా సందులు కొన్నిటి ద్వారా మరొక దారిమీదుగా నయినా వెళ్లవచ్చు. సందుగుండా వెడదామన్నది కొలంబా.

"ఎందుకు దారి మార్చటం?" అన్నాడు ఆర్సో. "ఇదిమాత్రం మన ప్రపంచానికి చెందింది కాదా?" అని గుర్రాన్ని మేయర్ ఇంటి ఎదురుగానే నడిపించుకుంటూ పోయాడు.

"ఎంత గుండె నిబ్బరం!" అన్నది కొలంబా. "నాన్నగారూ, మిమ్మల్ని హత్యచేసిన వారికి శిక్ష తప్పదు!" అంటూనే తను బారిచినీ ఇంటికీ, తన అన్నగారికీ మధ్య అడ్డుగా నడిపించింది తన గుర్రాన్ని. ఆ ఇంటి కిటికీలమీద ఒక కన్ను ఉంచుతూనే వచ్చింది.

"దొంగలు!" అంది కొలంబా తన అన్నగారితో. "కిటికీలన్నీ బిగించారు చూశావా? ఇదంతా రక్షణ సన్నాహంగావును! కాని ఎప్పటికయినా తెరవాలికదా!"

ఆర్సో దక్షిణం వైపుగా వెడుతున్నాడంటే, ఊరిలో ఒక సంచలనం ఏర్పడింది. ఇదొక పెద్ద దుస్సాహసం అనుకున్నారు చాలామంది. తటస్థంగా ఉండేవారు ఏవేవో అన్నారు: "బారిచినీ కొడుకులు ఇక్కడ లేకపోవటం అదృష్టమే! తమ తండ్రికివున్న నిదానం వారికి లేదు. ఈపాటికి ఆర్సో తిరస్కార ప్రవర్తన వారిని బాగా రెచ్చగొట్టి ఉండేది. అతనిమీద తగిన చర్య తీసుకునేవారు."

ఊరి పెద్దమనుష్యులలో ఒకడయిన ముసలివాడు ఒతకను అన్నాడు. "నేను చెప్పేది గుర్తుంచుకో! కొలంబా మొహం పరీక్షగా చూశాను. ఆమె బుర్రలో ఏదో మెదుల్తోంది. తుపాకి మందు వాసన అప్పుడే తగుల్తోంది నాకు! త్వరలోనే పియ్యొత్రనెరా కసాయి అంగళ్లలో మాంసాల ధరలు పడిపోతాయి."

(ఇంకా ఉంది)

## ఘరానా

19 వ పేజీ తరువాయి

తమకోసం వచ్చిన బళ్ళు ఎక్కడేనా నిలిపి ఉన్నా యేమో నని వెతకటానికి.

జానకమ్మగారి చుట్టూ మూగారు బంధువులు. అందరూ ముసలమ్మ గురించే మాట్లాడుకుంటున్నారు. ఆమె తెలివితేటలను గురించీ, ఆమె ఎంత సునాయాసంగా కాశీ రామేశ్వరం యాత్రలు చేసి వచ్చిందీ— చివరకు ఆవిడ మంచితనాన్ని గురించి కొంచెం చర్చ జరిగింది.

కొత్త వ్యక్తి వాళ్ళందర్నీ తప్పించుకుని జానకమ్మగారి దగ్గరగా వెళ్ళి "ముసలమ్మగారు పక్క స్టేషనులో దిగారండీ! ఫోనుచేసి కనుక్కున్నాను. మీరేం బెంగపెట్టుకోకండి! అటు నుంచి వచ్చే ట్రయినులో జాగ్రత్తగా పంపిస్తామని పక్క స్టేషను వాళ్ళు మాట ఇచ్చారు." అన్నాడు.

అందరూ ఆయన వేపు చూశారు ఇంత పరోపకార బుద్ధి ఉన్నందుకు మెచ్చుకున్నారు. అసలు ఇటువంటి మంచివాళ్ళు ఇంకా ఉండబట్టే ప్రపంచం ఈ మాత్రంగానయినా నడుస్తోంది లేకపోతే ఏనాడో అంతమయి పోయేదే నని పెళ్ళి చేయించవలసిన పురోహితుడు తన అభిప్రాయం చెప్పేశాడు.

'ఉదయం తొమ్మిది గంటలయింది. నిన్న నెప్పుడో సాయంత్రం తిన్న తిళ్ళు. అందరి మొహాల్లోనూ నీరసం— అలసటా!.... వీళ్ళ అతీగతీ కనుక్కునేందుకు ఇంత వరకూ ఎవరూ రాలేదు.' అని జానకమ్మగారి ఆడపెళ్ళివారి మీద విసుక్కున్నారు.

పెళ్ళికొడుకు శంకరం వెంటనే కోపడ్డాడు చిరాగ్గా మొహంపెట్టి 'నేను చెబితే విన్నారూ! ఈ పల్లెటూరి సంబంధం వద్దో మొర్రో అంటే.. నా మాట ఒక్కళ్ళ కయినా చెవికెక్కిందా! ఇంకేం అనుభవించండి...మీకు కావలసింది వేలు! అంతేగా!'

మూటులో ఉన్న వ్యక్తి చిరునవ్వు నవ్వాడు.

'ఒరే తప్పురా అలా అనకు' అని ఇద్దరు ముగ్గురు పెద్దవాళ్ళు కూకలేశారు.

కుశాలరావు, నాజూకయిన అమ్మాయి వేపు చూశాడు. కొరకొర చూసి తల తిప్పుకుందా అమ్మాయి.

ఆ అభినయం కుశాలరావు మనసును ఆనంద డోలికలో వూపేసింది.

'ఎవరీ అందగత్తె!.... శంకరం పెళ్ళికి రావడంచేతగదా ఇటువంటి సౌందర్యోపాసనకు అవకాశం కలిగినది! అందమంటే అందమా! అందంలో పందెం వేస్తానంటుంటేనూ! పాపం కాఫీ అలవాటు కాబోలు...ఎంత బాధ పడుతున్నదో!' అని కుశాలరావు బాధ పడ్డాడు.

అంతలో ఉన్నట్టుండి అందరి పెట్టెలూ సామాన్లూ బుజాల మీదకు ఎత్తుకుని పరిగెత్తుతున్నారు కొంతమంది.

ఏమిటి సంగతని కళ్ళతోటే అడిగాడు అందమయిన అమ్మాయిని కుశాలరావు. ఆమె అయోమయంగా చూసి తల తిప్పుకుంది.

ఆడ పెళ్ళి వారు పంపిన బళ్ళువిదానంగా ఆరు మైళ్ళు ప్రయాణం చేసి అప్పుడే చేరు

కున్నాయి. బోలెడు క్షమాపణలు చెప్పుకుని మగ పెళ్ళి వాళ్ళందరినీ బళ్ళల్లోకి చేర వేయిస్తు న్నాడు ఒకాయన.

అరగంటలో ప్లాట్‌ఫారం మీద పరచిన పెళ్ళి వారి సామాన్లు వాటి తాలూకు మనుష్యులు రెండె ద్దుల బళ్ళనిండ ఎక్కించబడ్డారు.

'తంతే బూరెల గంపలో పడినట్టుగా— వాజూ కమ్మాయి ఎక్కిన బండి ముందు వేపున కుశాల రావు ఎక్కవలసి వచ్చింది.'

'అంతా ఈశ్వరేచ్ఛ !' అనుకుని బండితో లేవాడి పక్కగా చోటు చేసుకుని కూర్చున్నాడు.

అటునుంచి వచ్చే రైల్లో వీరయ్యగారి తల్లి తిరుగు ప్రయాణమయి వస్తున్నందువ ఆమెకు స్వాగతమిచ్చి పెళ్ళి వారింటికి చేర్చగలందులకు మాటు వ్యక్తి ఉండిపోతానన్నాడు.

వీరయ్యగారు 'కాదు. మీరు ఈ ఒళ్ళతోనే వెళ్ళండి ! నేను ఇక్కడే ఉండి ఆమెను తీసుకుని వస్తా'నంటే, ఆయన వినకుండా వీరయ్యగార్ని అందరితోపాటు ప్రయాణం చేయించాడు.

మోహమోట పడుతూనే వీరయ్యగారు పెళ్ళి బళ్ళతో కలిసి బయలు దేరాడు.

'పరోపకారం వెధవ శరీరం' అన్నాడు కుశాల రావు బండి వాడితో మాట్లాడుతున్నట్టు.

'తవురు టౌను నుంచి వస్తుండరేంటి బాబూ.. హె, హె ! నీ తస్స గొయ్య ! హె ! !' బండి వాడు ఇటు ప్రశ్న ఒకటి పారేసి అటు ఎద్దులను అదిలించాడు.

కొంతదూరం పోయిం తర్వాత బండివాడికి బాలెన్ను మాట జ్ఞాపకం వచ్చినట్టు— 'వెనకాల బరువెక్కువయింది. కొంచెం వయికి సదురు (సర్దు !) కోండి' అని అరిచాడు.

వెనకగా కూచున్న నాజూకయిన అమ్మాయికి పైకి జరుగక తప్పలేదు !

క్రీగంట వెనక్కుచూసిన కుశాలరావు భగ వంతుని లీలలు మెచ్చుకోకుండ ఉండలేక పోయాడు.

'మనం వెళ్ళే దారిలో ఎక్కడయినా కాఫీ దొరుకుతుందా' అడిగాడు కుశాలరావు బండి వాణ్ణి.

'తవేరి కోసమని గంగాళాలతోటి కాసిపెట్టి వారు గదండీ కాఫీలు..ఆడ యీర బద్రయ్యగోరు. మళ్ళీ మద్దిన ఎందుకు !'

'అది నిజమేకాని అప్పటిదాకా ప్రాణం నిలవదే మరి !'

'మరీ ఇచిత్రం మీది ! అయినా బస్తీవోళ్ళు పొద్దున లేగిస్తే కాఫీ నీళ్ల మీద బతకాలిసిందేగా మరి.... అందుకే అంత ఊపిరి వేకుండ ఉంటారు మనుషులు !'

చీమలు పాకినట్టుగా ఉంది లోపల కూచున్న అమ్మాయికి.... ఏడుపు వచ్చినంత పనయింది. శంకరం పనిచేసే ఆఫీసులోనే పనిచేస్తున్నది శ్యామల. అతను ఎంతో బ్రతిమాలితేను, పల్లె టూరు చూడాలనే సరదాతోనూ బయలుదేరింది. రాత్రి తెల్లవార్లూ నిద్రలేదు. తెల్లవారినదగ్గర నుంచీ కాఫీలేదు. తల బద్దలయి పోతోంది. పయిగా వళ్ళంతా కుదిపివేస్తూ గతుకుల రోడ్డు మీద బండి ప్రయాణం !.... వీటి అన్నిటికంటే బాధాకరమయిన సంగతి— కళ్ళ జోడబ్బాయి బండివాడి సంభాషణ !

ఆ బండి దిగిపోయి ఇంకో బండి ఎక్కుదా మనుకుంది. కాని అందరూ కారణం అడుగు తారు. తెలిసిన వాళ్ళయితే ఏదో సర్ది చెప్పచ్చు ! అన్నీ కొత్త మొహాలే ! ఒక్క శంకరం తప్ప....

రెండుమైళ్ళు పోయిం తర్వాత— ముందు బండిని దాటెయ్యాలని వెనక బండివాళ్ళు, వీళ్ళను ముందుకు రాకుండా చెయ్యాలని ముందు బండీ వాళ్ళు పోటీలు పడి ఎద్దుల తోకలు మెలిపెట్టి హుషారు చేశారు.

అసలే గతుకుల రోడ్డు. అలవాటులేని ఎడ్ల బండి ప్రయాణం. అందులో గేలప్పు !

బళ్ళల్లో కూర్చున్న వాళ్ళ ప్రాణాలు స్వర్గా నికి చాల దగ్గరలో ఉన్నంత హాయిగా ఉన్నాయి.. జన్మ జన్మాలకు తెలిసి ఉండి ఎప్పుడూ ఇటువంటి చోట్లకు రాకూడ దనుకుంది శ్యామల.

కుశాలరావు పళ్ళన్నీ బిగపట్టి కూడచున్నాడు పడిపోకుండా ఉండాలని గట్టి ప్రయత్నం చేస్తూ. ఇక లోపల కూర్చున్న వాళ్ళ పరిస్థితి చెప్పడం ఎందుకు ! బళ్ళల్లో వాళ్ళు ఎంత మొత్తుకున్నా బళ్ళవాళ్ళకు ఆ ఉషారులో ఏమీ చెవికెక్కలేదు.

వాళ్ళదృష్టి ఎంత సేపటికి ముందు పోతున్న నరిసిగాడి బండిని దాటి ముందుకు పోవాలనే గానీ లోపల కూచున్న పెళ్ళివారి ప్రాణాలు కడగట్టి పోతున్నాయన్న తలంపు లేదు.

ఆ పరుగు పందెంలో ఒకచోట రోడ్డు గతు కుల్లో పడి లేచింది బండి ! ఆ కుదుపుకు బల్లిలా కరిచి పట్టుకున్న కుశాలరావు విసిరేసినట్టు వెనక్కు వెళ్ళి పడ్డాడు బండిలో ! కళ్ళజోడు ఎగిరి ఎక్కడో పడింది.

కుశాలరావు పరువు పోయింది. పౌరుషం వచ్చింది. అతి కష్టంమీద లేచి కూచున్నాడు. అతన్ని అనుకుని నాజూకయిన అమ్మాయి నానా అవస్థ పడుతోంది నవల్లేక మింగలేక !

'ఏయ్ నీకు బుద్ధి ఉందా లేదా !' అన్నాడు కుశాలరావు—

'ఉండు పంతులూ ! నువ్వేంటి మద్దిన ! ముందు బళ్ళకంటే ఎనకపడితే మనకే నామోషికాదంట ! బండివాడి సమాధానం !

కళ్ళజోడు కోసం చూసుకుంటే లేదు ! బండి లోకి చూచాడు కుశాలరావు. శ్యామల చేతుల్లో ఉంది తన కళ్ళజోడు. అతను తనవేపు చూడటం గమనించి కళ్ళజోడు అందించింది శ్యామల.

'మెనీ థ్యాంక్స్ !' అన్నాడు కళ్ళజోడు అందు కుంటూ.

'ఆ పిల్ల గనుకపట్టుకోక పోతే ఈ పాటికి ముక్కలయిపోయి ఉండేది' అన్నాడు ఆ బండిలోనే ప్రయాణంచేస్తున్న పురోహితుడు, పొడుంకాయలో నుంచి నశ్యం తీసి ఒక పట్టు పట్టటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూ.

కొత్త పాలెం చేరుకునేటప్పటికి చచ్చీ చెడి శాయంగల విన్నపాలయినయి.

విడిదిలోకి వెళ్ళగానే శ్యామల వాంతి చేస చేసుకున్నది దొడ్లోకివెళ్ళి. అది కనిపెట్టిన కుశా రావు చాలా బాధపడ్డాడు. వెంటనే పెళ్ళివారింటి పరిగెత్తాడు. చెంబులో కాఫీ పట్టించుకు విడిదికి వచ్చి అక్కడ శంకరం చెల్లెలు కనబడి ఆ పిల్ల చేతికిచ్చి ఆ అమ్మాయికిచ్చి రమ్మన్నాడు

విడిదిలో ఎవరికీ రాని కాఫీ ముందుగా తన కెట్లా వచ్చిందని ఆశ్చర్యపోయి కాఫీగ్లాసు అందుకు రెండుగుక్కల్లో ఖాళీ చేసింది శ్యామల.

'మీ అన్నయ్య ఇచ్చిరమ్మన్నారా కాఫీ !'

'ఉహూ ! అన్నయ్య కాదు. అన్నయ్య పక్క కూచున్నాడు చూడు కళ్ళజోడు పెట్టుకున్నా ఆయన !' ఆరేళ్ళయినా నిండని ఆ పిల్ల మా లకు విస్తు పోయింది శ్యామల.

బాధ కొంచెం ఉపశమించింది. వేడి నీళ స్నానం చేశాక బడలిక సగం తగ్గింది. ఇలా పె ళ్ళకు వెళ్ళడం ఇదే మొదటిసారి. పుట్టటం, పెర టం, చదువు, ఉద్యోగం అన్నీ బస్తీలోనే అవడ చేత పల్లె వాతావరణం చవిచూడాలనే అభిలాష మిత్రుని వివాహానికి రావడానికి అంగీకారం తె పింది. ఇదొక అనుభవం జీవితంలో అనుకున్న శ్యామల. కుశాలరావు మెదిలాడు మనసులో.



బహుశ శంకరంగారికి స్నేహితుడో, దగ్గర బంధువో అయి ఉంటాడు. పాపం అతనెంత ప్రయత్నించాడు తనతో మాట్లాడదామని. అతనెంత నొచ్చుకున్నాడో తన ప్రవర్తనకు! అతను తను వూహించుకొన్నంత రోగ్ యేమో కాదేమో పాపం, అనవసరంగా అతని మనసును గాయపరచింది. ఎవరి గొడవల్లో వాళ్ళుంటే— తను వాంతి చేసుకుని నానా బాధపడుతుంటే— అది గమనించి అతనే కాఫీ తెప్పించాడు!

'భోజనాలకు లేవండి. ఆ!.... పదండి సార్!.. పదండమ్మా! లేవండి. ఇప్పటికే పొద్దు పోయింది, అన్న పెళ్ళివారి పిలుపు శ్యామల ఆలోచనలకు అంతరాయం కలిగించింది.

అందరూ బయలుదేరి భోజనాలకు వెళ్ళిపోయారు. బడలికవల్ల ఆకలిగా లేక భోజనానికి వెళ్ళ దలుచుకోక విడిదిలోనే పడుకుంది.

పెళ్ళి కొడుక్కు భోజనం విడిదికే వచ్చింది. కుశాలరావు తనకు ఆకలిగా లేదన్నాడు.

'ఏడిశావులే పద ఇద్దరం కానిద్దాం!' అని లోపలికి లాక్కెళ్ళాడు శంకరం. లోపల పడుకున్న శ్యామల వీళ్ళను చూచి లేచి కూచుంది.

'అదేమిటి! మీరు భోజనం చెయ్యలేదా!' అన్నాడు అప్పటిదాకా ఆమె భోజనానికి వెళ్ళకుండ అక్కడే ఉన్నదని తెలీని పెళ్ళికొడుకు.

'వంట్లో బాగుండక వెళ్ళలేదు లెండి' అన్నది శ్యామల బడలికగా నవ్వుతూ.

'నో! నో! నా పెళ్ళికి వచ్చి ఉపోషం ఉండటమా' వీల్లేదు— వీడు మీలాగే అంటుంటే లాక్కొస్తున్నాను.... ఇద్దరూ ఒక్కలాగే ఉన్నారు మొత్తానికి' అన్నాడు శంకరం.

కుశాలరావు, శ్యామల అప్రయత్నంగా ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

'మీరు కూడ మాతోపాటే భోజనం కానిద్దురుగానీ లేవండి— పెళ్ళికొడుకు ఏమయినా బకాసురుడనుకున్నారో ఏమో— వాళ్ళు ముగ్గురికి సరిపడా పంపారు.... వూ! లేవండి!' అని తొందర పెట్టాడు శంకరం.

ఇరకాటంలో పడింది శ్యామల.

'ఇదొక పిక్నిక్ అనుకోండి! కొత్తపాళెం పిక్నిక్!' అన్నాడు శంకరం బలవంతం చేస్తూ.

శ్యామలకు తప్పలేదు లేచి విస్తళ్ళువేసి ముగ్గురికీ వడ్డించింది.

తల వంచుకుని తింటున్నాడు కుశాలరావు. నేల చూపులు చూస్తూ విస్తట్లో మెతుకులు కెలికేస్తున్నది శ్యామల.

'అరె! అదేమిటి. ఇందాకటి నుంచీ నసబోసిన పిట్టలాగ మాట్లాడుతున్నవాడివి బెల్లం కొట్టిన రాయిలా అయిపోయా వేమిటిరా!.... ఓహో! అదా సంగతి.... ఇందులో కొత్త వాళ్ళెవరు! అయినా పరిచయం చెయ్యక పోవడం నాదే తప్పు.. పరిచయం మధ్యలో 'నమస్తే'లు మాత్రం పెట్టుకోకండి ఎంగిలి చేతులు....'

కుశాలరావు శ్యామల నవ్వక తప్పలేదు.

'.... వీడు మిస్టర్ కుశాలరావ్. ఎం. ఏ. నాకు బెస్ట్ ఫ్రెండ్, క్రయిమ్ బ్రాంచిలో పని చేస్తున్నాడు హైదరాబాదులో, ఇక.... ఈమె కుమారి శ్యామల పి. యు. సి. మా ఆఫీసులో పని

# ఘ రా నా

చేస్తూ ఈవెనింగు కాలేజీలో స్టడీస్ కంటిన్యూ చేస్తున్నారు! అయ్యా అదీ విషయం."

'పోనీలే! కొద్దిలోనే ముగించావు' అన్నాడు కుశాలరావు. శ్యామల ఏదో అడగబోయి మానేసింది భోజన మయినంతసేపూ శంకరమే మాట్లాడాడు.

భోజనం ముగించి లేచే టప్పటికి సూటు వ్యక్తి శంకరం బామ్మను బండి ఎక్కించుకుని భద్రంగా తీసుకువచ్చి విడిదిలో దించాడు.

ఇంతలోకే కొడుకూ కోడలూ రావటంతో వాళ్ళ మీద విరుచుకు పడింది. "ముసలి పీనుగ పోతే పోయిందిలే చాలని వదిలి పెట్టి వూరుకున్నారు. ఆయన కడుపు చల్లగా నన్ను మెల్లిగా మళ్ళీ విమానం లో పడేశాడు తీసుకువచ్చి" ముక్కు తుడుచుకున్నది బామ్మగారు.

ఒకానొక నిర్మాత ఓ కవిగారిని పిలిచి రెండు నిముషాల్లో స్క్రీన్ ప్లే చేప్పెయ్యాలి అన్నాడు.

కథకుడు చెప్పిందంతావిని "మహా బచ్చుగావుంది......" అనబోతున్నంతలో "అయ్యో ఆగండి! ఇప్పుడు నే చెప్పింది షేక్స్‌పియర్ కథ; మీరు కాస్త చిత్తగిస్తే నా సొంతకథకు స్క్రీన్ ప్లే చెప్తా" అన్నాడు బయటికి పోయే నిర్మాతతో కథకుడు.

సరోజ, (తెనాలి)

సూటు వ్యక్తి వెళ్ళిపోయాడు.

రాత్రి తొమ్మిది బావుకు, ఖచ్చితంగా సూత్రధారణ జరిపించి తలంబ్రాలు పోయించాడు పురోహితుడు. అంటే అసలు ముహూర్తానికి అయిదు నిముషాలు ముందుగానే.

పెళ్ళితంతు జరుగుతున్నంత సేపూ కుశాలరావు కళ్ళు పట్టుచీర కట్టుకుని పెళ్ళి పందిటో ముత్తయిదువుల్లో కలిసి కూచున్న శ్యామల మీదే ఉన్నాయి!

పొడుగ్గా ఉన్న శంకరం నిటారుగా కూచుని పొట్టిగా ఉన్న పెళ్ళికూతురి నెత్తిన తలంబ్రాలు దోసిళ్ళతో గుమ్మరించి ఉక్కిరి బిక్కిరి చేసి ఆనందిస్తున్నాడు.

'శంకరం కూచున్న స్థానంలో తనూ — ఎదురుగా శ్యామల ఇలాగే ఆడుకుంటే ఎవరిది పైచేయవుతుందో!' అని ఊహా లోకంలో విహరిస్తున్న కుశాలరావుకు పెళ్ళి పందిట్లో ఏదో అలజడి జరుగుతున్నదని తెలుసుకోవటానికి కొంత వ్యవధి పట్టింది.

పెళ్ళి కూతురికని చేయించిన చంద్రహారం, వడ్డాణం, కళ్ళె వంకీలు ఘనంగా నలుగురికీ చూపించి కోడలు పిల్లకు అందించింది జానకమ్మగారు గర్వంగా పట్టుచీర జరీ పమిట సర్దుకుంటూ.

సూటు వ్యక్తి వచ్చి నలుగురి మధ్యా నించున్నాడు.

'వీరయ్యగారూ క్షమించండి మీరు చట్టరీత్యా నేరస్థులు! పధ్నాలుగు కేరట్ల కంటె ఎక్కువ వన్నె బంగారం ఉపయోగించకూడదని తెలిసిగూడా చట్టాన్ని వ్యతిరేకించి — మేలిమి బంగారంతో నగలు చేయించడం నేరం!.....'

అందరూ శిలా ప్రతిమలయి పోయారు.

'.... నే నెవరిని అడగటానికి అని మీరనుకోవచ్చు. నేను సి. ఐ. డి. శాఖకు చెందిన వాడిని. ఇంతకంటె వివరాలు అనవసరం అనుకుంటాను.'

వీరభద్రయ్యగారికి నోట మాట రాలేదు! నలుగురిలో నవ్వుల పాలయినట్లయింది. ఇప్పుడింత బంగారం ఇలవి పరం చెయ్యకపోతె జైలులో పెట్టిస్తాడో ఏమిటో! అప్పుడు తన గతేంగాను!

'ఏమంటారు!' అన్నట్లు వీరయ్యగారి వేపు చూశాడు సూటు వ్యక్తి. ఆయన అప్పటికే నిర్వికల్ప సమాధిలో ఉన్నాడు.

కుశాలరావు బుర్ర చురుకుగా పనిచేసింది. సూటు వ్యక్తి ముఖంవేపు పరిశీలనగా చూశాడు. తను పనిచేస్తున్న డిపార్టుమెంటుకు వచ్చిన నేరస్థుల ఫోటో ఆల్బం— స్మృతి పథంలో మెదిలింది.

'మిస్టర్ డానియల్ ఉరఫ్ విజయకుమార్! వీళ్ళిక్కడ చట్టరీత్యా నేరం చేసినా అది ఒక శుభ కార్యం కోసమూ— హిందూ ధర్మశాస్త్ర ప్రకారం నవ వధూవరుల కల్యాణం కోసమూ సమర్పించుకుంటున్న కానుకలీ నగలు— కాని, నువ్వు గుండెలు దీసిన బంటువి! పచ్చి రక్తంతో దాహం తీర్చుకునే గజదొంగవి! అధికారులకు దొరక్కుండా తప్పించుకు తిరుగుతున్న పచ్చి రౌడీవి.... ఇంత మంది మధ్యలో నిలబడి పారిపోదామని వృథా ప్రయత్నం చేయకు. ఇక్కడి గ్రామస్థుల చేతుల్లో దొరికావంటే సున్నంలోకి ఎముక మిగల్చరు.' అన్నాడు కుశాలరావు.

ఇప్పుడు శిలా ప్రతిమగా మారటం సూటు వ్యక్తి వంతు.

'అయ్యో వీడమ్మ కడుపు మాడ. ఇందుకేనా మోసు నా వెంటబడి అన్ని వివరాలూ అడిగి తెలుసుకున్నాడు!' అని బామ్మగారు వాపోయారు. అందరిలోనూ చైతన్యం కలిగింది.

వీరభద్రయ్యగారు సూటు వ్యక్తి చేతులకు తాడు బిగించి మునసబు గారింటికి పంపించారు మిగతావని ఆయన్ని చూసుకోమని.

శంకరం పసుపు బట్టలతోనే లేచివచ్చి కుశాలరావును కౌగలించుకున్నాడు!

* * *

తిరుగు ప్రయాణంలో కావాలని బుద్ధిపూర్వకంగానే కుశాలరావు ఎక్కిన బండిలో ఎక్కింది శ్యామల. అతనికి దగ్గరగానే కూర్చుంది. ప్రశ్నలతో ఊదర గొట్టి చంపేసింది దారి పొడుగునా! ★

మున్నా.......వాళ్ల నాన్న ఆ అమ్మాయికి వేరే పెళ్లి" భాస్కరం లేచాడు.

"ఒరే! అలా అనకురా—పరీక్షలు జీవితంలో నెగ్గలేనంత దద్దమ్మనురా నేనూ?" అన్నాడు మూర్తి బాధగా.

"కావు! ఐ విష్ యూ గుడ్‌లక్" శైలజను సురేఖనీ, పద్మావతినీ "యిన్వైట్ చేస్తూ, ఓ పిక్‌నిక్ పెట్టు. నే వస్తా" నన్నాడు భాస్కరం సీరియస్‌గా.

"ఓ......కే.....అవునూ సురేఖా అంటే ఎవరూ ఆ డిబేట్‌ల అమ్మాయేనా?" మూర్తి కొంటెగా అడిగాడు.

"అక్షరాల ఆ ఎత్తు మడమల జోళ్లు తొడుక్కునే అమ్మాయే!" భాస్కరం అర్జంట్ పని ఉన్నవాడిలా వెళ్ళిపోయాడు.

అట్నుంచి వస్తూన్న సురేఖ పద్మావతీ, భాస్కరాన్ని చూశారు.

సురేఖ వెంటనే "వెళ్ళవోయ్! నీ అనిరుద్ధుడు వస్తున్నాడూ" అంటూ వెళ్ళిపోబోయింది.

పద్మావతికి సంభ్రమం కలిగింది కాని, భాస్కరం ఆమెను పలకరించలేదు.

"మాట!......సురేఖగారూ!......" భాస్కరం పద్మావతి దగ్గరకు వస్తూనే నాలుగు అడుగులు అటు వేసిన సురేఖను పిలిచాడు.—

పద్మావతిని ఎవరో కప్పులో ఛెళ్ళున కొట్టినట్లైంది—మొహం కందిపోయింది.

"గుడ్‌మార్నింగ్! నాకూ కాస్త లైబ్రరీలో..." అంటూ సురేఖ వెళ్ళడం మానలేదు—వెను దిరిగి చూసిందంతే—

భాస్కరం వారించి అన్నాడు "మీ దొడ్డమ్మ గారు నా చేత మీకు పాత ఆవకాయ ఒకటి పంపించారు.......మీరు వస్తూ వస్తూ అడిగి అలాగే మరిచి పోయారుటగా....... అదీ ....."

"వ్వాట్? దొడ్డమ్మకి మతిపోయింది లావుంది! ఆవకాయకు మరెవ్వరూ దొరకలేదా పాపం! మీరా?" నొచ్చుకుంది సురేఖ సిగ్గుపడిపోయి మరీ.

పద్మావతికి ఆ యిద్దరి మాటలూ హిబ్రూవో లాటినో అయితే తెలియ నట్లుంది—

"మీ దొడ్డమ్మ?" అంది స్వగతం పలికి నట్లు—

"ఔను పద్మా!.....వాళ్ళ దొడ్డమ్మగారు దొడ్డ మనిషి.......కావాలంటే నన్ను కూడా వేసుకోమన్నారు కాస్త ఆవకాయ" భాస్కరం చెప్పేడు అవసరం లేకపోయినా నవ్వుతూ.

"వేసుకోండి......" సురేఖ నవ్వుతూ చర చరా వెళ్ళిపోయింది.

భాస్కరం ముక్కున గుద్దినట్లు విస్తుబోయాడు.

పద్మావతి ఉడుకు మోత్తనం దాచుకోలేక సతమతమై పోయింది.

"నాకూ కాస్త పనుంది" అంటూ వెళ్ళబోయింది.

"నీతో మాటాడాలి పద్మా" అన్నాడు భాస్కరం కాస్త క్రుంగిపోయి.

"పదిమందిలోనూ పద్మా..! అనకండి" విసవిసా వెళిపోయింది పద్మావతి.

కోపమూ ఈర్ష్యా ఆమె ప్రతి కదలికలోనూ కదిలాయి.

# ప్రేమకు పగ్గాలు

23 వ పేజీ తరువాయి

"మై గుడ్నెస్....." భాస్కరం నిర్విణ్ణుడై పోయాడు "ఏం చెయ్యను! ఈ సురేఖగారు అంతా చెప్పేసింది—ఇక లాభంలేదు......పోయి ఆ సముద్రంలో దూకాలి" అనుకుంటూ ఏం చెయ్యాలో తెలియక పద్మావతి మలుపు దాటేదాకా అక్కడే నిలబడ్డాడు. "పద్మా! పద్మా" అనుకున్నాడు తిడుతున్నట్లు.

"ఏమండీ! కాస్త ఔట్ గేటు చూపెడతారూ" ఒకావిడ పిల్లలతో సహా ఎగ్జిబిషన్ చూడ వచ్చింది కాబోలు దారి తప్పి, అడిగింది.

"పదండి! నేనూ అటే వెళ్తున్నాను. దిగబెడ్తాను" భాస్కరం వాళ్లను సొంత బంధువులైనట్లు తీసుకు వెళ్లాడు.

## 30

పద్మావతి చాలా పెద్ద తప్పు చేశానని ఆనక నొచ్చుకుంది. ఇంటికివెళ్ళి ఏడ్చింది కూడా.

"అమ్మాయి ఇప్పణ్నుంచీ చదవకపోతే క్లాసు మార్కులు రావు...... బి. ఏ. లో ఎలా చదివే దానివి......అలాంటిది ఇప్పుడు కాస్త పుస్తకాలేనా దుమ్ము దులపడం లేదు......" జయమ్మ బాధ పడ్డది. కాని, పద్మావతి మారు పలకలేదు.

"ఒంట్లో బాగో లేదమ్మా" అన్నది. తలగడలో తల దూర్చుకుంది.

సురేఖ కూడా నొచ్చుకుంది. తను అమర్యాదకరంగా ప్రవర్తించానేమో ననుకుంది—ఆ ఇద్దరి మధ్య నేనో పెద్ద అగాధమై నిలబడట మెందుకు? లేదు......లేదు.....సరిగ్గా నాగరికత ఏలా నేర్పిందో అదే సభ్యతను ప్రదర్శించాను అనుకుంది మళ్ళీ.

చుట్టూరా ఉన్న వాతావరణమంతా వూళ్లోని పిల్లా పీచూ, ఆడా మగా బలగంతో కలకలమంటూ ఉంటే తన కెందుకనో వెలితిగా వుంది. పద్మావతి "వెర్రిది ఏడు స్తుందేమో—దాని ఇంటికి వెళ్దనా?" అనుకుంది మళ్లీ ఆ తలంపు మానేసింది.

అన్ని బస్సులకీ రద్దీగానే వుంది. క్యూలో నిలబడటంలాంటి మంచి పనులు విశాఖపట్నమంత దూరం ఇంకా రాలేదు—పోట్టలు బస్సులో తాము వెళ్ళదల్చుకోలేదు. అప్పుడు తనకు తెలిసిన స్నేహితుల నెవ్వరినీ చూడాలని లేదు సురేఖకి.

ఎట్టకేలకు ఒక రిక్షా దొరికింది. అది ఎక్కిందన్న మాటేగాని, వాడు హాస్టలు చేరేలోగా ఎన్నిసార్లు ఎంత ఆయాసపడీ, ఎగుడు దిగుడు రోడ్ల మీద పోవాలో తల్చుకుని జాలి పడ్డది. ఆధునిక జీవితంలో, ఉచ్చ నీచాలలాగ, ధనిక బీద వర్గాలకు మల్లే, ఎత్తు పల్లాలు, దిబ్బలూ, మలుపులూ, విశాఖపట్నం రోడ్లు.

ఎర్ర మట్టి దిబ్బలను సాధించి చవిటి నేలను ఇసికె పర్రలనూ వేధించి, వాటికి రెక్లాండ్స్ అని అంత లేసి భవనాలు కట్టుకున్నారు మనుష్యులు—అంచాతనే కాబోలు వెర్రిగా సముద్రం మరీ మరీ నవ్వసాగింది.

'హాయిగా పూరి పాకలు వేసు కోరాదూ? ఇంత లేసి మేడలూ, వాటిముందు బోర్డులూ, ఇంకా ముందు కుక్కలూ పెట్టుకుని 'సముద్రం గాలి' మెయ్యకపోతే?......'

కాని, రిక్షా జర్రున జారుతూ వెళ్తూంటే ఈ ప్రాంతమే బాగుంది, అనుకుంది సురేఖ హాయిగా ఒక ప్రియుడు ప్రేయసీ ఇంత సముద్రమూ, అంతా ప్రశాంతమూ. ఒక్క సముద్రానికే చెల్లింది, హోరుమంటూ ప్రశాంతతనూ, గాంభీర్యాన్నీ ఇవ్వగలగడం—

కాని, తాను ఎవరి ప్రేయసి కావాలి?

వెనుకటికి గుంటూరు కాలేజీలో జానకీరాం అనే అబ్బాయి తనకి ప్రేమలేఖ రాశాడు—తను ప్రిన్సిపాల్‌తో చెప్పి, అతణ్ని 'సస్పెండ్' చేయించింది. ఇవాళ బాధగా ఉంది—తప్పు చేసినట్లు వుంది.

ఆ జానకీరాం ఇవాళ ఇలాంటి ఏ బీచ్‌లోనో సాయంకాలంచేసి, తనకంటే అందమైన మరో మల్లికతో షికారు వచ్చాడేమో? కాని—ఇవాళ తనను కావాలని వెంటపడ్డ వారందర్నీ నెమరు వేసుకుని ఏం లాభం?

"హాయిగా చదువుకోవాలి" అనుకుంది.

నీలంగా ఆకుపచ్చగా, తెల్లగా, బుస్సున,ఎత్తున హోరున సముద్రం లేచి లేచి పడుతూనే ఉన్నది—వృథా పోతున్నదనిపించింది.....



# ప్రేమకు పగ్గాలు

తను చదువుకుని ఏం చేయాలి?

ఉద్యోగం చేయాలి అంటే దొడ్డమ్మ ఒప్పుకోదూ?—పోనీ భాస్కరం లాంటి కుర్రాణ్ణి తీసుకుని .కాని భాస్కరాన్నే అయితే మాత్రం పద్మావతి ఏడుస్తుంది!

నిస్సందేహంగా తనకి తెల్సు—

భాస్కరంతో తను మాట్లాడినా పద్మావతి ఏడుస్తుంది—పాపం! అది అతగాన్ని ప్రేమించిందిగా! సురేఖ జాలి పడ్డది చుట్టూరా చూసింది. "పాపం! సముద్రం" అనుకుంది జాలి పడ్డది. సూర్యుడు ఏ పనీ లేని కుర్రవాడు గోలీ లాడుకుంటున్నట్లు సముద్రంమీద రద్దీ లేని రోడ్డుమీదా ప్రతాపం చూపిస్తున్నాడు "పాపం!" అనుకుంది సురేఖ మళ్లీ.

హాస్టలు వచ్చింది. రిక్షావాడు చెమటతో, నల్లగా ఎండలో మిల మిలా మెరిసిపోతూన్నాడు...... సురేఖను వాడు చూడనేలేదు. డబ్బులు చేతులో పడగానే యాంత్రికంగా, రిక్షా ఎక్కి వెళ్ళిపోయాడు. 'పాపం!' అనుకుంది— వీణ్ణి కూడా వీడి పెళ్ళాం ప్రేమిస్తుంది బహుశా పద్మావతి భాస్కరాన్ని కోపం తెచ్చుకున్నట్లు దానికి వీడిమీద కోపం వస్తుందా? ఏమో మరి—"నాకు మతి పోతోందా?" గొణుక్కుంది

ఒక్కో అడుగు వేస్తూ వెళ్ళింది రూముకి. ఇష్టం లేనట్లు—తను కూడా హాయిగా పద్మావతి లాగే ఈ పాటికి భాస్కరంకంటే అందమైన వాణ్ణి ప్రేమించేదేమోగాని, పాపం దొడ్డమ్మ గోల పెడుతుందని మానేసింది

రూము తీస్తూనే ఉత్తరం అగుపించగా అది అందుకుని చూసింది — దొడ్డమ్మ రాసింది. "ధనమ్మ వ్రాలు" అని రాస్తుందామె

ఆదుర్దాగా మంచం మీద వాలి చదువుకుంది.

". నీకు ఆవకాయ — వెల్లులిపాయలువేసినది యిచ్చెదనని చెప్పినాను—నీవు మరిచిపోయితివి మన చిరంజీవి భాస్కరరావుగారు అనగా — శ్రీ సుబ్బారావు బావగారి కుమార్డు — అనగా నీకు తెలిసి వుండును అతగాడు యిచ్చటకు రాగా ఒబ్బాయా! నీవు అమ్మాయిని చూస్తావేమో—ఈ తెలివి మీరిన కాలాన ఒంటి తప్పు కాదు — పిల్లది పరదా పడ్డది ఈ ఆవకాయ కాస్త-దానికి అందిస్తావా? అని అడిగినాను పిల్లవాడు అందగాడేకాదు బహుబుద్ధిమంతుడు— తప్పక ఇచ్చెదనని అన్నాడు పుచ్చుకొనుము—కాస్త మర్యాదగా మాటలాడ వలయును. ఇట్లు కాబోవు అల్లునికి పని పురమాయించినాను అని ఏమీ నొచ్చుకొనకుము అట్లా అన్నానుగదాని—చనువుగా తిరగకుము—పెద్ద దాన్ని అన్నానుగదాని అనుకోకు నీ ఆరోగ్యము జాగర్త—అక్కడనుంచి నీవు వచ్చేముందు రాయి. డబ్బు పంపుతాను. ! "

"ఏ డబ్బుతో నన్ను కొన్నావు దొడ్డమ్మా....."

ఉత్తరం అలాగే పట్టుకుని బోర్లా తిరిగి పడుక్కుంది.

"ఏం బాధ వచ్చిందిరా భగవంతుడా? అని కణతలు నొక్కుకుంది.

"అయ్యో! ఇంకా ఏం రాసిందో దొడ్డమ్మ.....! కాగితం రెండోవైపు త్రిప్పి చదువుకుంది.

"ముకుందరావుకు వాళ్ల వసంతను ఖాయం చేశాను. అన్ని లాంఛనాలు అమర్చ గలిగాను— నువ్వు ఒప్పుకుంటే ఏడాది తర్వాత ఈ ఒక్క ముచ్చటా దీర్చుకుని,—నేను కూడా మీ పెద్ద నాన్నగారి దగ్గరకే వెళ్ళిపోతాను—నువ్వు చదువుకున్నదానివి ఇప్పటికే నీకు వయస్సు వచ్చినది—బాగా ఆలోచించుకొనుము—నీ దొడ్డమ్మ కట్నం ఇవ్వదు అని భావించకు—పెళ్ళి కొమరుడు వద్దు అనినన్నూ, చెవులు మెలి తిప్పి ఇచ్చెదను. అది నా గౌరవము ."

సురేఖ నవ్వుకుంది "ఎంత అహంకారం దొడ్డమ్మా! నీది పెళ్ళికుమారుడు పెళ్ళి కుమార్తె—నీ చేతుల్లో బొమ్మలనుకుంటున్నావా?......" అని ఆలోచిస్తూనే "కాకపోతే యేమిటీ? నేను దొడ్డమ్మకి ఇష్టమైన బొమ్మనేగా మరి" అనుకుంది సురేఖ.

దొడ్డమ్మకి ఉత్తరం రాస్తే భాస్కరం చెల్లెలు పెళ్ళి రెండూ ఆగిపోతాయి. పైగా ఈ ముకుందాన్ని దుఃఖ పెట్టాలి ..... పాపం ..... పద్మావతికి ఎవరున్నారు—తల్లి ఒక్కర్తెగదా.......పోయి ఆమెను చూడనా? ఒక్కసారి?......అనుకుంది.

సురేఖకు సిగ్గేసింది. అల్మారాలో పుస్తకాల మీద ఒక సాలీడు తన ప్రియునికి పట్టు అల్లుకుంటున్నది. బల్లమీద తెరిచివున్న పుస్తకం పేజీలు అలాగే రెపరెపలాడుతున్నాయి.

తను "ఎమ్మే" అవ్వాలని కదూ వస్త... షేక్స్పియర్‌మీద నోట్స్ కంఠతా పట్టడం వల్లా, తనకీ, తను ఎమ్మే ప్యాసవడం వల్లా దొడ్డమ్మకీ ఏమిటి లాభం?? గడియారం చూసుకుంది. పది నిమిషాలు తక్కువ నాలుగు గంటలైంది. ఈ పాటికి పద్మావతి భాస్కరం ఇద్దరూ కూడా కాస్త స్థిమితం చిక్కించుకుని ఉంటారు—అనుకుంది

"కాఫీ త్రాగాలి" అనుకుంటూ లేచింది

* * *

ఐతే ఈపాటికి భాస్కరం, పద్మావతి దగ్గరకు వెళ్ళనేలేదు — నేరుగా ఎగ్జిబిషన్‌లో తను ప్రదర్శనకర్తగావున్న 'స్టాల్' దగ్గరికివెళ్ళి కూచున్నాడు—రక రకాల మనుషు లొస్తున్నారు....... పిల్లలు ఆడవాళ్ళు, మగవాళ్ళు.... .ఒకరు ఇంగిలీషులో చెప్పండీ అంటే ఇంకొకరు "హిందీ వచ్చా" అంటున్నారు

"రామన్ ఎఫెక్టుకీ ఆకాశం నీలంగా అగుపించడానికీ సమ్మంధం ఏమిటీ?" అంటున్నారు. కొందరు.

"రామన్ ఎఫెక్టును తెలుగులో చెప్పమన్నారింకా" కొందరు

"కాలేజీలో చదువుకునే అబ్బాయిలకు, అమ్మాయిలకూ వాళ్ళ డిగ్రీలకు వాళ్ల ప్రేమలకు సమ్మంధమేమిటీ?" అన్నాడు ఒక ముసిలాయన భాస్కరాన్ని అదోలా చూస్తూ... ...ముసి ముసిగా నవ్వుతో.

"యవ్వనం" అన్నాడు భాస్కరం

ఆ ముసిలాయన కాస్త ప్రక్కకి జరిగి జనం అంతా వెళ్లిపోయాకా, "పెళ్ళి అయిందా బాబూ! మీకూ" అన్నాడు.

"అయింది"

ఆశ్చర్యపోయాడు అతడు.. "నేను కలెక్టరు ఆఫీసులో గుమాస్తాగా ఇరవై ఏళ్లు చేశా ... అసలు మాకు కరణీకం వుంది కాస్త పొలమూ వుంది......" అన్నాడు కళ్ళజోడుతీసి మడిచి మళ్ళీ పెట్టుకుని.

"ఆడపిల్లలు కూడా ఉన్నారా?" నవ్వుతూ అడిగాడు భాస్కరం.

వస్తున్నారు జనం! వెళ్తున్నారు జనం! ఆ ముసిలాయన నిరాశపడ్డాడు "ఉన్నారుగాని, నీకు పెళ్లైపోయిందిగా" అనుకుంటూ వెళ్ళిపోయాడు.

ఐదయింది—గేట్లు మూసేస్తున్నారు .. .. భాస్కరం మళ్లీ ఆలోచనలలో పడ్డాడు. తిన్నగా పోయి, సముద్ర పొడ్డున కూచున్నాడు.

పద్మావతి వెళ్ళిపోయింది.. . కోపంతో వెళ్లిపోయింది—సురేఖ అవకాయ తననే వేసుకోమంది.

పిన్ని తను పెళ్ళి చేసుకోవా లంటుంది.

వసంతకు "సురేఖ"ను తాను అన్యాయం చేస్తానేమోగాని, ప్రేమించలేనని తెలిసిపోయింది.

ధనమ్మగారికి కట్నం పుచ్చుకోనంటే తనమీద మరింత వ్యామోహం కలిగింది.....

"పిన్నికి అన్నీ విపరీతర్థాలూ, విశేషార్థాలుగా తోస్తాయి... "

భాస్కరానికి పరీక్షల్లో ఫస్టుమార్కు వస్తుందనే ఆశ సన్నగిల్లిపోయింది

ధనమ్మ ఇస్తానన్నకంటే కట్నం జయమ్మ ఇస్తానంటే?

కాని, పద్మావతి తనను పెళ్ళిళ్ల మార్కెట్‌లో గెల్చుకోవర్సిందేనా? ...... అంతేనా? అంత తాహతు జయమ్మకులేదు. పద్మావతికి తనను కొనుక్కోగల అవకాశాలు లేవు......

తాను కట్నం వద్దంటే పద్మావతి ప్రేమను గౌరవిస్తున్నాడుగాని—పిన్ని ప్రేమను తృణీకరిస్తున్నాడని పిన్ని ఉద్దేశమే మరి?

ఎవరిది ప్రేమ? తనదా? పిన్నిదా? పద్మావతిదా? ఎవరిది? . ..పద్మావతికి మాత్రం తాను ఇవన్నీ చెబుతే అర్థం అవుతాయా?

"మీ పిన్నిగారు మీకు కట్నం గల పిల్లను చేస్తారు చేసుకోండి ..." అని పద్మావతి వెళ్లిపోవచ్చును

'నేను పద్మావతిని ఒదిలి బ్రతకలేను' అనుకుంటూ లేచి ఏడు గంటలవేళ చీకట్లను చీల్చుకుంటూ, హాస్టల్‌కేసి నడిచాడు భాస్కరం

"అసలు ప్రేమంటూ ఉందా? ఏమో ఏమో . "

(ఇంకా వుంది)

# బాంధవ్యం

13 వ పేజీ తరువాయి

శ్రీమతి గిరిజను మా యింట్లో ఉండనీయడానికి ఒప్పుకుంది.

నేను కొంచెం విముఖత చూపించబోతే, నాతో చాలా గట్టిగా వాదించి నన్ను కూడా ఒప్పించింది. ఆవిడ చెప్పిన మాట లేమిటంటే, గిరిజ విషయంలో నాకు తనకు కూడా చాలా బాధ్యత ఉందట బంధువులకు చేసిన మేలే మేలట! అందులో మన చేతిమీదుగా ఒక పెళ్లి జరిపించామంటే ఎంతో పుణ్యంట ఈలాటి విషయాలు ఎన్నో చెప్పి చివరికి నాచేత 'తప్పకుండా మనం గిరిజ బాధ్యత వహిద్దాం' అనిపింపజేసింది

నాకు కూడా మా ఆవిడ చెప్పిన మాటలు సబబుగానే కన్పించాయి మా అమ్మమ్మ జ్ఞాపకం వచ్చింది ఆవిడ బంధువులంటే ఎంత ప్రేమ చూపించేది! ఎంతమంది చుట్టాల అమ్మాయిలకు పెళ్లిళ్లు చేయించింది! అస లిటువంటి పరిస్థితుల్లో ఆవిడ ఉంటే వెంటనే గిరిజ భారం తను వహించేది. లోకంలో చివరికి మిగిలేది మనిషి చేసే మంచే కదా! అమ్మమ్మ చనిపోయినా ఎంతమంది ఆవిడ చేసిన మేలును తల్చుకుంటున్నారు! నిజంగా మా ఆవిడ మంచిపని చేసిందనిపించింది

గిరిజ మా యింటికి వచ్చిన దగ్గర్నుంచీ నాకూ కొంత కాలక్షేపం అవటం ప్రారంభించింది నాకు ఎవ్వరూ స్వంత చెల్లెళ్లు లేకపోవటంవల్ల అది 'అన్నయ్యా!' 'అన్నయ్యా!' అని నన్ను పిలుస్తూంటే ఎంతో ముచ్చటనిపించింది అది పల్లెటూరులో పుట్టి పెరగటంవల్ల, చాలా అమాయకంగా ఉన్నా, దాని తెలివితేటలవల్ల క్రమంగా అన్నీ తెలుసుకో నారంభించింది సినిమాలూ, పత్రికలూ చుట్టూ ఉన్న వాతావరణం ఆరు నెలలలో దానిని పూర్తిగా మార్చేశాయి దానిలో పరనాశక్తి హెచ్చుగా ఉండటంవల్ల, పుస్తకాలు చదవడం నేర్చుకుంది నేను దాని వ్రాత విషయంలో శ్రద్ధ వహించాను మా ఆవిడ, దానికి కుట్లూ, అల్లికలూ నేర్పసాగింది పట్నంలో ఉండడంవల్ల స్నో, పౌడర్లుపయోగించడం అబ్బింది చీరకట్టులోనూ, జడ వేసుకోవటంలోనూ ప్రస్తుత ఫాషన్లు పట్టుబడ్డాయి. మొదట్లో అది మా యింటికి వచ్చినప్పుడు పొట్టి నేత చీరలు కట్టుకుని, గట్టిగా జడ వేసుకుని పల్లెటూరుతనాన్ని చాటుతూండేది అలాటిది వదులుగా 'జడ వేసుకోవడం, పొట్ట కొంచెం కన్పించేటట్లు అందంగా కుచ్చెళ్లు పెట్టి చీర కట్టుకోవడం, నైలాన్లూ, జార్జిట్‌లు వాడడం నేర్చుకుంది సన్నగా, పొడుగ్గా ఉండి, మంచి ఛాయా, తీరైన మొహం కలదీ కాబట్టి, కట్టూ బొట్టూ బాగుండేసరికి అందంగా తయారైంది.

సినిమాపాటలంటే దానికి తగని పిచ్చి. దాని గొంతుక సన్నంగా ఉండి, పాడుతుంటే చాలా బాగుండేది. ఇరుగు పొరుగు ఇళ్లల్లోని అమ్మాయిలతో దానికి బాగా పరిచయం అయింది అప్పుడప్పుడు వాళ్లతో కలిసి సినిమాలకు వెళ్తూండేది.

ఒక సంవత్సరం దాటి రెండో సంవత్సరం ప్రవేశించింది. గిరిజ మా యింటికి వచ్చి అప్పటికి

మీకు తెలియవలసిన దేమంటే ఈ రోజుల్లో ఆడ పిల్ల పెళ్లి చెయ్యడం చాలా కష్టం.—అవి. గిరిజకు తగిన వరుడు—అంటే కాస్త చూడ చక్కనివాడు, అధమం బి. ఏ. పాసయి ఉద్యోగం చేస్తున్న పాతికేళ్లలోపు యువకుడు—చాలా కట్నం పోస్తేనే గాని దొరకడు. ఏవో కొన్ని బీద సంబంధాలూ, చదువులేనివాళ్లవీ చూశాం కాని అవి మాక మాకు నచ్చలేదు. నేను వాకబుచేసిన అరడజను సంబంధాలలో ఒకటో పొసగలేదు. చివరకు దీనిని కూడా ఏ ముసలాడికో అంటగట్టాలేమో నని భయపడ్డాను. వాళ్లక్కకు మల్లేనే దీనిని రెండో పెళ్లి వాడికి, వయస్సు ముదిరిన వాడికి ఇవ్వక తప్పదేమో ననిపించింది.

ఇలా నేను మధనపడుతున్న సమయంలో, మా శ్రీమతి ఒకనాటి రాత్రి ఒక వింత వార్త నా చెవిని వేసింది. ఆ వార్త చెప్పడంలో ఆమె చాలా నేర్పు చూపించింది. ముందు ప్రస్తుత సినిమాలూ, పత్రికలూ, వీటికి వయసులో ఉన్న యువతీ యువకులపై ఉన్న ప్రభావం గురించి సంభాషణ ప్రారంభించింది ప్రేమ వివాహాలపై నా అభిప్రాయా లడిగింది. కట్నాల సమస్య ఎంత గడ్డుగా ఉందో విమర్శించింది. ఆ సమస్యా పరిష్కారానికి యువతీ యువకులే పూనుకోవాలని హెచ్చరించింది. ఒక వయసులో ఉన్న యువకుడూ, యువతీ ప్రేమించుకోవడం తప్పా ? అని అడిగింది నేను, తప్పు కాదన్నాను. అయితే ఆ విషయం తెలిసిన పెద్దవాళ్లు వాళ్లిద్దరికీ పెళ్లి చెయ్యాలి కదా—అంది అవునన్నాను నేను ఆవిడ ఎందుకీ విషయాలన్నీ మాట్లాడుతోందో తెలియక అంతతో వూరుకోక, "అందరూ కబుర్లు చెప్పేవారే కాని, క్రియ చెయ్యాల్సి వచ్చేటప్పుడు వెనుకంజ వేస్తారు మీ మట్టుకు మీరు క్రియ చెయ్యగలరా ?" అని అడిగింది.

ఆవిడ అలా అడిగేసరికి నాకు చాలా చిన్నతనం వేసింది మా వివాహానికి పూర్వం, ఆవిడను ప్రేమించి, పెద్దవాళ్ల నెదురించి, కట్నం పుచ్చుకోకుండా పెళ్లి చేసుకుంటానని పట్టుబట్టినందుకు వన్నిప్పుడు ఎత్తిపొడుస్తోం దనుకుని "నా కసలు విన్ను ప్రేమించడానికి అవకాశం దొరికితేగా. అప్పటికే పెళ్లిచూపుల్లో మన కళ్లు రెండూ ..." అనబోతూంటే ఆవిడ అడ్డువచ్చి, "చాల్లెండి, నే నన్నది మన విషయం కాదు, గిరిజ విషయం" అంది.

"గిరిజ విషయమా ?" అన్నాను ఆశ్చర్యపోతూ ఆవిడ అవునంది నాకు అనుమానంవేసి "గిరిజ ఎవర్నయినా ప్రేమించిందా ?" అనడిగాను మాఆవిడ తలూపింది.

ఎవరికైనా, ఎవరినైనా ప్రేమించడానికి అర్హత లేదని నే ననను, కాని గిరిజ, ఎవరో కుర్రాణ్ణి ప్రేమిస్తే ఆ సమస్య పరిష్కరించడం ఎలా ? ఈమె బీదవారి పిల్ల చదువు సంధ్యలు లేనిది. ప్రేమించడం తప్ప మరో క్వాలిఫికేషన్ లేనిదీ. ఏ అబ్బాయైనా ఎలా చేసుకుంటాడు ?

"ఇదిగో ఈ ఉత్తరం చూడండి" అని మా శ్రీమతి నా చేతికి ఒక కాగితం ఇచ్చింది. అది ప్రేమలేఖ. అది పూర్తిగా చదివేసరికి, మా ఎదురింట్లో రూము అద్దెకు తీసుకుని, యూనివర్సిటీలో 'లా' రెండో ఏడు చదువుతున్న ప్రభాకరం. తెలుగు భావ కవిత్వంలో కృష్ణశాస్త్రి శ్రీ శ్రీ ల మాత్రం తెలిసినదని, బహుశా తానొకటి కట్టి కూడా ఉంటాడనీ, (లేకపోతే ఏ పత్రికలోనో కాపీకొట్టి కూడా ఉండవచ్చు ననుకోండి) మొత్తానికి మా గిరిజను అమాంతంగా, అఖండంగా, అద్భుతంగా ప్రేమించాడని, బోధపడింది.

"మరి గిరిజ ప్రేమలో పడిందన్నావు ?" అని అడిగాను మా ఆవిడని. అపుడు ఆమె చెప్పింది. ఆ లేఖ మూడు రోజుల క్రితం ప్రభాకరం, మా గిరిజ సావిట్లో కూర్చుని చదువుకుంటుంటే ఆమె పాదాలవద్ద విసిరేశాడట. ఆ లేఖ తను చదివి (బహుశా ఆనందించి) గిరిజ మా ఆవిడ కిచ్చిందట. మా ఆవిడ వెంటనే కంగారుపడి, నాతో ఫిర్యాదు చెయ్యక, తీరికగా ఒక పూటంతా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చిందట. ఆ నిర్ణయమేమిటంటే, ప్రభాకరానికి గిరిజ నిచ్చి పెళ్లి చెయ్యడం, అందుకు గిరిజ అంగీకారం కూడా తీసుకుందట. ఇక మిగిలిందల్లా నన్ను 'టాకిల్' చెయ్యడం ! ఎలా చేసిందో తెలుస్తోందిగా.

నాకు వ్యక్తిగతంగా, ప్రభాకరానికి గిరిజ నివ్వటంలో ఏ అభ్యంతరమూ లేదు. పైగా, ప్రభాకరం అందమైన ఇరవై రెండేళ్ల యువకుడు, లా చదువుతున్నాడు. లక్షాధికారుల బిడ్డ. అతన్ని కలుసుకుని మాట్లాడాను. అతని తలిదండ్రులు ఎన్నో మంచి సంబంధాలు, తెస్తుంటే అవేవి నచ్చక గిరిజనే పెళ్లి చేసుకుంటానని పట్టుబట్టాడు.

వెంటనే మా దొడ్డమ్మనీ, మరికొందరు చుట్టాల్నీ పిలిపించి పెళ్లి ఏర్పాట్లు చేయించాను. మావాళ్లు పెద్ద ఎత్తులో పెళ్లి చెయ్యలేరు కాబట్టి 'సింపుల్' గా సింహాచలం కొండమీద పెళ్లి అయిందనిపించాను. పెళ్లికొడుకు తరపు బంధువు లెవరూ రాలేదు. అతని తల్లిదండ్రులు అతనిమీద కోపంకొద్దీ రాలేదుకాని, పెళ్లయ్యాక భార్యను తీసుకుని వెడ్తే, పిల్లని చూసి ఏమీ అనలేదట. ప్రభాకరం చదువు మానేసి ఉద్యోగ ప్రయత్నం చేసి రెండు నెలలో మంచి ఉద్యోగం కూడా సంపాదించుకున్నాడు. అన్నీ బాగానే జరిగాయనుకున్నాం.

కాని చిన్న గొడవ మాత్రం మిగిలిపోయింది. ఈ పెళ్లి ఎంత నిరాడంబరంగా జరిపినా నాచేతి చొక్క దొక్క అయిదారు వందలు ఖర్చుల నిమిత్తం ఖర్చయ్యాయి మా దొడ్డమ్మ పెళ్లికొడుక్కి ఏవైనా లాంచనాలు జరిపించాలనీ, అందుకోసం మూడు నాలుగు వందల రూపాయలు అప్పు తన కిమ్మనీ అడిగింది. నేను నా దగ్గర ఆ డబ్బు లేదన్నాను. దాంతో మా దొడ్డమ్మకూ వాళ్లందరికీ నామీద చాలా కోపం వచ్చింది. రుసరుసలూ, మూతి విరుపులూ, మొహం ముడుచుకోవడాలతో పెళ్లి ఎలాగో అయిందనిపించి, వెంటనే మూత్న వధూవరులను వాళ్ల ఊరు తీసుకెళ్లిపోయారు. వాళ్లు వెళ్లిన రోజున నాకూ, కమలకూ మనసుకు చాలా కష్టం అనిపించింది.

మేము గిరిజ పెళ్లి గురించి ఎంత సరదా పడ్డామో తరువాత అంత బాధ పడ్డాం. ఒక్కసారిగా మా దొడ్డమ్మ మామీద 'కోల్డువార్' ప్రకటించేసింది. అదివరకు తరుచూ వాళ్ల కుటుంబంవారు మా యింటికీ వస్తూ పోతూ ఉండేవారు. అది పూర్తిగా 'బంద్' అయిపోయింది. ఆఖరికి వూర్లో ఉన్న శారదకూడా మా యింటికీ రావడం మానేసింది. నాకు కొంత

# రాజధాని కబుర్లు

11 వ పేజీ తరువాయి

**కూడదు. ఈ ఆగస్టు పదిహేను ఈవిధంగా దేశ** చరిత్రలో ఎక్కువ ప్రాధాన్యాన్ని సంపాదించు కుంటోంది

ఇక రాజకీయంగా చూడబోతే అనాటి ఆగస్టు ముందున్న అనిశ్చిత వాతావరణమే ఈనాడూ కన్పి స్తోంది. ప్రభుత్వాలు వేసే పన్నులు, ప్రజలు పడే బాధలు అటుంచుతే ఇంకో ఉపద్రవం వచ్చి పడింది. పరిపాలనా వ్యవస్థ సుస్థిరం యింతవరకు కాలేదు. అంటే మనవాళ్ళు పరిపాలనాభారం తీసుకుని పదహారేళ్ళయినా పరిపాలనా యంత్రాం గంలో ఉన్న అవకతవకలు మాత్రం అట్లాగే ఉండి పోయినాయి దాని మూలాన ఏర్పడ్డ యితరత్రా బాధల మాట చెప్పనే అక్కర్లేదు. ఇప్పుడు ఇంతకీ దేశ మొత్తంమీద ఓ విధమైన సంచలనం ఏర్ప డింది ఎక్కడో స్విచ్ నొక్కుతే ఎక్కడో లైటు ఆరిపోయినట్లు, ఢిల్లీలో కాంగ్రెసు కమిటీవారు ఆమోదించిన తీర్మానాల ఫలితంగా రాజధానిలో అలజడి కలవరం, గగుర్పాటు, మనసు స్థిమితం లేకపోవటం ఏర్పడ్డాయి నిన్న మొన్నటిదాకా నిక్క చ్చిగా, నిష్కర్షగా చెపుతూ వస్తున్న ముఖ్య మంత్రి పీఠం కదిలింది ఇంకా నాలుగేళ్ళ వరకు ముఖ్యమంత్రిగానే ప్రజలకు సేవచేద్దా మనుకుం టున్న ఆవేశానికి అవరోధం కలిగింది. ఇక కావలసి నంత సందడి రాజధానిలో గగ్గోలు పుట్టిపోతోంది. ఏనోట మాసినా యీ ముక్కే! మరి ఈయన గారు వెళ్ళిపోతే ఎవరొస్తారు ! అసలు ఈయన వెళ్ళిపోవటం సగాట ఖాయమేనా ? ఈయన వ్యతిరేక గ్రూపులో ముందుకొచ్చి ముఖ్యమంత్రిగా నిలబడే సమర్థుడెవ్వడు ? అలాంటప్పుడు ఈయన చెప్పే వ్యక్తే ముఖ్యమంత్రి అయి కూర్చుంటా డుగా ! అలాంటప్పుడు ఒరిగి పడేదేముంది ! ఇంక మంత్రులకు వూపిరే ఆడటంలేదు ఎవరొస్తే ఏం, మనం మాత్రం ఇక్కడుంటే చాలు, దీని కివ్వాళ్టినుంచి ఏంచెయ్యాలి— ఈ ఆలోచనల్లో నిమగ్ను లవుతున్నారు కొంతమంది పదవులకు కద లిక వచ్చిన తర్వాత పరిపాలన పట్ల ఎవరికి శ్రద్ధ ! ముందర మన మంటేగదా, దీని విషయం ఏమిటో తేల్చుకున్న తర్వాత, మిగతా విషయాలు చూసుకో వచ్చులే అనే భావం ! ఒక్క పెట్టున భారీ ఎత్తున ఇంతటి మార్పు రావటానికి కారణం ఏమిటి ? పరిపాలనా యంత్రాంగం కంటె కాంగ్రెసుపార్టీ పటిష్టం కావాలని, అఖిలభారత కాంగ్రెసు కమిటీవారు తీర్మానించటం. మనకు పదవులిచ్చేది కాంగ్రెసు సంస్థే గదా ! మరి యివి శాశ్వతంగా ఉండాలంటే ఆ సంస్థ బలపడాలి అందువలన ముందర ఆ సంస్థ బలపడేటట్లు చూస్తే మిగతావన్నీ వాటంతటవి సర్దుకుపోతా యని ! వెనకటికి, కడుపులో నెప్పివస్తే కాళ్ళల్లో మందు వేశాడుట ! అట్లా ఉంది యీ పద్ధతి. కొంతమంది రాజకీయ చతురులు ఈ తీర్మానాన్ని శల్యపరీక్ష చేసి, కొన్ని నిర్ణయాలకు వచ్చారు. కాంగ్రెసు సంస్థను ఏదో చెయ్యాలనే ఉద్దేశ్యంతో పెట్టిందికాదు కొంతమంది మంత్రులుచేసే చర్యలపట్ల నెహ్రూకు చాలా అసహ్యం కలిగింది. అయినా బాహాటంగా అనటానికి యిష్టంలేక ఆయన సర్వాధికారాలు చేతిలో పెట్టుకుని, ఒక్కొ క్కళ్ళని దిగు దిగు అంటూ నాగస్వరం పలుకుతా డనీ, కొంతమంది మిత్రులమీద తీవ్రమైన ఆరో పణ లున్నాయి, వీటిని విచారణకు పెడితే గతంలో అయిన అనుభవం దృష్ట్యా రుజువవుతాయనే భయంతో వాళ్ళను పదవుల్లోంచే తీసేస్తే ఈ బెడద ఉండదుకదా అని — ఇట్లా తలోవిధా అనుకుంటున్నారు నీరు పల్లమెరుగు నిజం దేవు డెరుగు !

మన ముఖ్యమంత్రిగారు మాత్రం రాజీనామా ఢిల్లీలో యిచ్చేసి చేతులు తుడుచుకుని వచ్చేశా రుట ! ఆయన ఒకర్ని లెక్కచేసే మనిషి కాడు తన కేది తోస్తే అది చెయ్యటమే ఇది ప్రకాశం గారి శిష్యరికంవలన అబ్బిన పుణ్యమని ఆయన ఆంత రంగికులే అంటూవుంటారు ఆయనే ఒకసారి అన్నారు "ఈ మంత్రిపదవి అనేదే బంతిలాంటిది **ఎంత విసురుగా గిరాటువేసి కొడితే అంత త్వర** గానే మళ్ళీ మనదగ్గర కొస్తుంది. అట్లా కాకుండా దానివెంట పడ్డామంటే అసలు మనకు చిక్కదూ" అని ఆ దృష్టితోనే ఈసారి బలం కొద్దీ గిరాటు వేసినట్టున్నారు మరి మళ్ళీ ఆయనే అనుకున్నట్లు తిరిగి వస్తుందో, లేకపోతే ఈ బలానికి తట్టుకోలేక పగిలి చక్కా పోతుందో చూడాలి. 'క్లీన్ అడ్మినిస్ట్రేషన్' (సక్రమమైన పరిపాలన)కు కంకణం కట్టుకున్న ముఖ్యమంత్రిని, అదేమిటో ప్రజలకు చూపించకుండానే మధ్యలోనే దిగి రమ్మ నటం సంతృప్తికరంగా లేదు పరిపాలనలోంచి బైటకువచ్చి కాంగ్రెసులో చేరమనట మనే పద్ధతే వింతగా ఉంది దీనివలన ఫలితాలు ఏవిధంగా ఉంటాయో, ఇప్పుడే ప్రబలంగా ఉన్న ముఠా రాజకీయాలు, కలతలు ఏవిధంగా పరిణమిస్తాయో వూహించలేకండా ఉన్నారు హాయిగా ఉన్న ప్రాణా లకు యీసరు తెచ్చి పెట్టారు. కార్లల్లో టాక్సీ లలో ఒకటే తిరుగుడు గాంధిభవన్, గ్రీన్‌లాండ్ ఎం. ఎల్. ఏ క్వార్టర్స్ చుట్టూ

పాపం అల్లూరి సత్యనారాయణరాజుగారిక్ సుస్తీ తీవ్రతరమైంది. క్షణంలో మార్పు వచ్చేసి, అందర్నీ ఆందోళన పరిచింది. మంత్రులు, శాసన సభ్యులు, ఉస్మానియా హాస్పటల్‌కు వెళ్ళి చూసి వస్తున్నారు ఆయన అనారోగ్య పరిస్థితి తెలుసుకుని సంజీవయ్యగారు కూడా చూడటానికి కొత్తఢిల్లీ నుంచి ప్రత్యే కంగా వచ్చారు. అందర్ని గాభరా పెట్టిన ఉద్రిక్త మైన స్థితి తగ్గింది. ఈ పదిహేనవతేదీ ఉదయం డాక్టర్లు చూసి ఫరవాలే దన్నారు ఆంధ్ర రాజకీయాల్లో ఆయన పాత్ర ఎంతో ప్రాముఖ్య మైనదిగా వస్తూ ఉండటంవలన వారి అనారోగ్యం కూడా చాలామందిని నిరుత్సాహ పరచిందనటంలో సందేహం లేదు కాంగ్రెసువారు తెచ్చిపెట్టిన ఈ కొత్త తీర్మానం ఏవిధంగా అమలు అవుతుందో అని రాజధాని ప్రజలు కూడా తహతహతో ఎదురు చూస్తున్నారు

—ఐ ఎల్. ఎన్ ★

# బాంధవ్యం

వూపిరి పీల్చుకున్నట్లయింది ఎంద పె అర్ధ రాత్రి, అపరాత్రీ పిల్లా, జెల్లాతో సహా రైలు దిగి తిన్నగా మా యింటికే వచ్చేస్తూండడం, వారం రోజులకీ తక్కువ లేకుండా తిష్ట వేస్తూం డడం, దానివల్ల బోలెడు డబ్బు ఖర్చూ, కమలకు శరీర శ్రమా—ఇవన్నీ తప్పాయి.

కానీ కమల మాత్రం అప్పుడప్పుడు ఇతర మధ్యవర్తుల ద్వారా వాళ్ళు మమ్మల్నసే మాటలు వింటూ బాధపడుతూండేది. మాకు మర్యాదా, మంచీ తెలియదనీ, బొత్తిగా మాలో ఉపకార గుణం లేదనీ స్వార్థపరులమనీ, బంధువులకు ఉప కారం చెయ్యడం అంటే మాకు గిట్టదనీ మా దొడ్డమ్మ అందరితోను చెప్పింది. గిరిజ పెళ్ళి, శారద భర్త పూనుకోవడంవల్ల జరిగిందట పైగా నన్ను నమ్ముకోబట్టే, ఆ పెళ్లి అంత అధ్వాన్నంగా జరిగిందట నేను నమ్మించి మోసం చేసినట్లు కూడా కొందరితో అందట. ఈ మాటలకు కమల బాధపడుతూంటే "ఆ, పోనిద్దూ. ఇంద్రులో మధ్య వర్తుల కల్పనెంతో" అని మా కమలను ఓదార్చాను.

సుమారు రెండేళ్ల తరువాత మా మేనత్త మనుమరాలి పెళ్ళికి నేను శ్రీకాకుళం వెళ్ళాను కమల నాతో రాలేదు నేను ఒక్కణ్ణే వెళ్ళాను ఈ పెళ్ళికి మా దొడ్డమ్మా వాళ్ళూ తప్పకుండా వస్తారని నాకు తెలుసు అందువల్ల వాళ్లను కూడా చూడాలని ఉండి వెళ్ళాను. పెళ్ళి రాత్రి ఎనిమిది గంటలకు బస్సులో శ్రీకాకుళం మధ్యాహ్నం రెండు గంటలకు చేరుకుని, పెళ్ళివారింట్లో భోజనం చేశాను మా మేనత్త బాగా ముసలిది ఆవిడ మేడమీద గదిలో ఉందని తెలిసి, ఆవిణ్ణి పలక రిద్దామని మెట్లు ఎక్కి వెళ్ళాను. గదిలోంచి మాటలు పైకి విన్పిస్తున్నాయి. ఆ గొంతుక మా దొడ్డమ్మదనీ, ఆ మాటలు నా గురించేననీ తెలుసుకున్నాను. "ఏడాదిపాటు వాళ్లింట్లో పిల్ల చేత నానా చాకిరీ చేయించుకుని, చివరకు పెళ్ళి **సమయంలో దాని చేతిలో గాని, పెళ్ళికొడుకుకు** గాని ఒక్క రూపాయి పెట్టలేదంటే నమ్ము" అని చెప్తోంది.

నేను గదిలోకి వెళ్ళగానే మొహం మాడ్చు కుంది. మా మేనత్తను పలకరించి, మా దొడ్డమ్మను కూడా పలకరించాను నాకు ఏదో సమాధానం చెప్పి అక్కడనుంచి వెళ్ళిపోయింది. తరువాత నేను మా మేనత్తను అడిగాను నామీద ఏమేమి పితూరీలు చెప్పిందని ? దాని కావిడ నవ్వి "దాని తత్వమే అంతరా ! బాంధవ్యంలో ఎంత చేసినా అంతేలే తృప్తనేది ఉండదు." అని తేల్చి పారేసింది. నేనూ మా కమలకామాటే చెప్పాను. పెళ్ళినించి వెళ్ళేక కానీ ఈసారి ఎవరైనా బంధువు లొస్తే మట్టుకు మా కమల ముందే నాకు వార్నింగిస్తుంది. "ఇదిగో మీరు వాళ్ళ బాధ్యత మాత్రం నెత్తిమీద వేసుకోవద్దు. తరువాత బాధ పడి లాభంలేదు". నేను నవ్వుకుంటూ, "నే నలాటి పని చెయ్యను. మీ ఆడవాళ్ళే, పొగడ్తలకు పొంగి పోయి ...." అంటూ, **మాట సగంలోనే ముగి స్తాను** ★

# న్యూఢిల్లీ లేఖ

7 వ పేజీ తరువాయి

**పరోక్ష బలవంతెందార్వారా తన ఇష్టాన్ని ప్రజలచేత జరిపించే రాష్ట్రంలో సమాజం కలిసిపోలేదా! అలాంటి కమ్యూనిస్టు తత్వాన్ని ప్రధానమంత్రి తన మంత్రివర్గంలోనే పెరుగుతుంటే ఎందుకు పేక్షించినట్లు? మరి దీనికి జవాబు లేదుగా...!**

* * *

మొత్తంమీద, అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గం శ్రీ నెహ్రూను నియంతగా చేసింది. ఎందుకంటున్నానంటే కాంగ్రెస్‌పార్టీ కార్యక్రమానికి పనికివచ్చే మనిషెవరో నిర్ణయించాల్సిన వ్యక్తి ఆయనే మరి! అసలీ కొత్త పథకంలో ఉద్దేశ్యమేమంటే భారతదేశాన్ని ఐదు ప్రాంతాలుగా విభజించి ఆ ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క ఉపాధ్యక్షుని క్రింద, వీళ్ళంత కాంగ్రెస్ అధ్యక్షునికి లోబడి ఉండేలాగున, ఈకార్యక్రమతీర్థమంతా ప్రధానమంత్రి అనే శంఖంలో పోసి పవిత్రం చేసేస్తారుట ఇంకోరకంగా చెప్పాలంటే వివిధ రాష్ట్రాలల్లోని కాంగ్రెస్‌పార్టీకి చెందిన ముఖ్యమంత్రులందరూ తమకార్యకలాపాలకు నాలుగు అజ్మాయిషిల క్రింద పనిచేయాలన్నమాట. ప్రధానమంత్రి, కాంగ్రెస్ అధ్యక్షులు, ప్రాంతీయ ఉపాధ్యక్షులు, రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు ఈ నల్గురూ ముఖ్యమంత్రుల పాలిటి భర్తలన్నమాట. ఈ కార్యక్రమం క్రమం జయప్రదం కావట మనేది, ప్రాంతీయ ఉపాధ్యక్షుల వ్యక్తిత్వం, శక్తి సామర్థ్యాలమీద ఆధారపడి ఉంటుంది అప లింతకీ కావలసిందల్లా క్రమశిక్షణగాని, శరీర పెంపకం కాదు.

**ఇంకోవిధంగాచూస్తే మొన్న జరిగిన అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం విఫలమైందన్న మాట కారణమేమంటే, ఈ సమావేశం, ధరల పెరుగుదల, స్వర్ణ నియంత్రణం, నిర్బంధపు పొదుపు, దేశంలో విస్తృత వ్యాప్తిలోవున్న అవినీతిలాంటి అతిముఖ్య, ప్రాథమిక సమస్యల్లో ఏ ఒక్కదాన్ని గూర్చి చర్చించనేలేదు**

* * *

1911 సంవత్సరపు 'ఇండియన్ పేటెంట్ ఆక్టు' ను సవరించాలని ప్రభుత్వం నిశ్చయించుకుంది వచ్చే శీతాకాలపు పార్లమెంటు సమావేశంలో ప్రవేశ పెట్టేందుకు ముసాయిదాను తయారు చేస్తున్నారు. కవులు హక్కును 15 ఏళ్ల నుంచి 10 ఏళ్లకు తగ్గించటం, ధాన్య పరిశ్రమలు, మందులు మొదలైన వాటిని ఈ పేటెంటు హక్కుల చట్టం నుంచి తొలగించటం, రాయల్టీని 3% కు పరిమితం చేయటం ఈ సవరణ బిల్లు ముఖ్యోద్దేశ్యం అయితే యిప్పటికీ ఆహార పదార్థాలు, మందులు, మొదలైనవాటికీ ఉన్న పేటెంటు హక్కును గౌరవించటమా లేక ఇవి తీసివేస్తున్నందువల్ల ఈ కంపెనీలకు పరిహారం యివ్వటమా అనేది ఇంకా ఆలోచనలో ఉంది అయితే ఒకటి మాత్రం రూఢి ఐపోయింది ఈ కొత్త శాసన బాధితులకు, న్యాయస్థానాలకు అప్పీలు చేసుకొనే అవకాశాలు ఉండవు. అయితే ప్రభుత్వానికి అప్పీలు చేసుకోవచ్చు. ప్రభుత్వం ఇచ్చే తీర్పే ఖాయమవుతుంది.

సమాజంలో ఆరోగ్యం వర్ధిల్లే విషయం దృష్ట్యా, దైనందిన జీవితంలో ఉపయోగించే ఆహారధాన్యాలు, మందులు మొదలైనవాటిని సరసమైన ధరలకు ఇచ్చే ఏర్పాటు చేయాలనీ, ఇలాంటి వస్తువుల విషయంలో ఏవిధమైన గుత్త వ్యాపారాన్ని అనుమతించకూడదనీ చాలామంది కోరుతున్నారు

అసలు ఈ సమస్యతో తుల్యమైనవి, ఇంతకన్నా అధిక ప్రాధాన్యం కలవి ఎన్నో పరిశీలనార్హమైన విషయాలున్నాయి. అందులో మొదటిది. ఈ దేశములో జనాభిప్రాయం ఉన్న పరిస్థితి, ప్రభుత్వ యంత్రాంగంలోని అసామర్థ్యం ఈ దేశంలో కల్తీ జరగటానికి ముఖ్యమైన కారణాలు. ఎటువంటి నీతి నిర్బంధాలు లేకుండా ఢిల్లీ నడిబొడ్డులోనే నకిలీ మందులు తయారు కావటం తెలియని విషయం కాదు. కేవలం మందుల ధరలే ముఖ్యమైన విషయమైతే నగరంలోని చాందినీ చౌకులో మందులు ఈ చట్టంతోటి ప్రమేయం లేకుండానే చౌకగానే దొరుకుతూ ఉన్నాయి

**ప్రస్తుతం మాదిరిగా ప్రభుత్వ యంత్రాంగం అసమర్థంగా మందకొడిగా, ఉన్నంతకాలం, చట్టాన్ని సవరించకూడదు. అలా సవరించటం వల్ల, ఇంతవరకు మంచి సిసలైన మందులు దొరికేందుకు కారణమైన ఒక్క రక్షణ చర్యను తీసి పారేయటమే ఔతుంది. ఇప్పుడున్న చట్టం వల్ల కల్తీలేని మందులు దొరుకుతున్నై. ప్రాణం నిలిపే మందుల లాంటి వాటి విషయంలో ఈ రక్షణ చాలా అవసరం. తన వాళ్ళను దక్కించుకోవాలనుకున్నప్పుడు పేద**

## న్యూఢిల్లీ లేఖ

**వానికూడా ధర అనేది పెద్ద లెక్కలోది కాదు. ఓ ఇరవై మందుల విషయంలో వైద్యులకున్న అభిప్రాయాలు ఈ బిల్లు శాసనరూపం దాల్చేందుకు ప్రతిబంధకాలు కావచ్చు.**

వీటన్నిటికన్నా ముఖ్యమైన విషయం ఇంకొకటుంది మందుల ధర తగ్గించేకన్న చౌకగా వైద్య వసుపాయం ఏర్పరిస్తే బాగుంటుంది ఉదాహరణకు పెన్సిలిన్ ఉందనుకోండి, ఒరణాల ఖరీదు కల ఆ యింజక్షన్ ఇచ్చేందుకు డాక్టరు ఐదు రూపాయలు పిండుతున్నాడు

ఏదో సవరణలు, 130 క్లాజులు ఉన్నందువల్ల ప్రజలు నమ్ముతారని వీళ్ల కున్నంత సులభంగా ఈ బిల్లు శాసనరూపం దాల్చదు

ఇండో అమెరికన్ కంపెనీ మద్రాసు రబ్బరు ఫ్యాక్టరీ ఆధ్వర్యాన మద్రాసులో రబ్బరు పరిశోధనా కేంద్రాన్ని ఏర్పరిచారు ఈ అమెరికన్ సంస్థలో మాన్స్ఫీల్డ్ టైర్ రబ్బరు కంపెనీకి కొంత పాలు ఉంది ఈ పరిశోధనా కేంద్రంలో స్వతస్సిద్ధంగాను, అనుబంధ రూపంలోను పరిశోధన జరపటమే గాక, శిక్షణ ఇవ్వటం గూడ జరుగుతుంది ఇందుకు కావాల్సిన చాలా సామగ్రి ఇదివరకే వచ్చింది మిగిలింది త్వరలో వస్తుందిట!

* * *

ప్రణాళికా సంఘం టెలి కమ్యూనికేషన్ అభివృద్ధికి కేటాయించిన మొత్తాలు చూస్తే ఆ పథకం ఎంత అవాస్తవికమైందో ఇట్టే తెలిసిపోతుంది మొదటి ప్రణాళికలో రు 40 కోట్లు, రెండో ప్రణాళికలో 53 కోట్లూ కేటాయిస్తే మూడో ప్రణాళికలో రు 65 కోట్లు కేటాయించడం జరిగింది దేశంలో ఈ కాలంలో ధరల పెరుగుదల దృష్ట్యా చూస్తే ఈ మూడు ప్రణాళికలలోను ఈ కేటాయింపు ఒకే రీతిగా ఉన్నట్లు తెలుస్తుంది ఇదిలా ఉండగా ట్రంక్ టెలిఫోన్ల వినియోగం ఏయేటి కాయేడు రెట్టింపవుతున్నది ఇప్పటికి 23% వినియోగం ఉన్నది. మూడేళ్లలో మూడు రెట్లు అయ్యే అవకాశం ఉంది ఇంక స్థానిక ఎక్స్చేంజిలలో, స్వరత్వరగా ఏర్పాటు చేయటానికి టెలిఫోను లీడ్‌లు లేకపోవటంవల్ల టెలిఫోనుల కోరుతున్నవారి సంఖ్య పెరిగిపోతూ ఉంది

* * *

టెలిప్రింటర్ల తయారు సాలీనా 1200 ల నుంచి 2500 లకు పెంచాలని భారతప్రభుత్వం నిర్ణయించింది

టెలెక్స్—సర్వీసులు రోజూ పెరిగిపోతున్నాయి ఇప్పటికి ఢిల్లీ, బొంబాయి, కలకత్తాలలో సుమారు 600 పైగా ఇలాంటివి ఉన్నాయి ఇక్కడ సుమారు దినసరి 80 యూనిట్లు పని చేస్తూ ఉన్నాయి. ★

# 'మరువలేని మనిషి'

## రచన: గురుదత్

ఈ శీర్షిక పేరెత్తేటప్పటికి నా జీవితంలో బాగా గడ్డురోజులన్నీ జ్ఞాపకం వచ్చాయి. అవి.... అంటే యీ విశాలమైన చలనచిత్ర ప్రపంచంలో నేను ఒక అనామకుడుగా మసలిన రోజులు జ్ఞాపకానికొస్తాయి.

చీకటంటే అంతా చీకటి కాదు. ఆ చీకటి చివరి అంచుల్లో ఏ మూలో వెలుగు కిరణాలు వెలిసే ఉంటాయిట. అలాగా చీకటిమయమైన



పాఠకులకు నా శుభాకాంక్షలు

నా జీవితంలో ఒక వ్యక్తి నాలో ఉత్సాహం ఉత్తేజం కలిగించి ఆశాజ్యోతిని వెలిగించాడు.

ఆ వ్యక్తి ఇప్పుడు నాతో లేడు. ఇకెప్పటికీ నా దగ్గరికి రాడు. భౌతికంగా ఆతని వియోగం నాకెంతో లోటును, రోజు రోజుకి ఎక్కువ చేస్తూనే ఉంది. ఈనాటి నా జీవితానికి ఆయన ఏదో కాగడా పట్టి మార్గదర్శకుడయ్యాడనటం లేదు కాని, సరైన మార్గంలో నా జీవితాన్ని మలుచుకోవటంలో అతని ప్రభావం ఎక్కువ కన్పించింది అజ్ఞానానికి ప్రతిబింబంగా ఉన్న నా నుండి ఉన్నత ప్రమాణాలు నెలకొల్పుకోగల నటుణ్ణి మలచిన శిల్పంగా మాత్రం చెప్పగలను

భౌతికంగా దూరమైనా ఆతని మాటలు, నా కష్టకాలంలో అత నిచ్చిన సలహాలు, ఆతని మూర్తిని యీనాటికి నా హృదయంలో పదిలపరచి 'ఆతడు లేడు' అన్న భావాన్ని వీలైనంతవరకు కన్పడనీయటంలేదు. ఒక్కమాటలో ఉన్నతమైన ఆశయంతోటి ఆశతోటి నేచేసే ప్రతి ప్రయత్నానికి వెన్నెముక ఆ వ్యక్తే.

అతడే స్వర్గీయ గ్యాన్‌ముఖర్జీ. భౌతికంగా కన్పడకపోయినా తన విజ్ఞాన దీపికను నాలో వెలిగించి ఆ వెలుగులో నా జీవితపుదారి చూచుకునేట్లు చేశాడు. ఆ వ్యక్తి నెలకొల్పిన స్మృతులు, మూర్తి శాశ్వతం, ఎవ్వరు చెరపలేరు.

అయినా మనస్సు మళ్లీ వెనక్కే పరుగెడ్తోంది .... 'జీవన్' చిత్రం తీసే రోజుల్లో నేను చాలా నిరాశావాదిగా ఉండేవాణ్ణి. అంటే ఆ చిత్రంలో గమ్య మేమిటో తెలియక కాదు, నాలో ధైర్యం దిగజారుతూన్నందువల్ల. ఈ వ్యాధికి తగ్గ మందు వేసి గ్యాన్ ముఖర్జీ ముందడుగు వేయాల్సిందిగా ప్రోత్సహించారు. ఆయన ఊతంతో నాలో నిరాశ, నిస్పృహలకు అవకాశమే కలగలేదు.

ఆ రోజులోనే ఆయన క్రింద పనిచేసేవాణ్ణి. ఆయన సలహాలు, ఇచ్చిన ఊతం, ఉత్సాహం, ఒక సహాయకుడికి యిస్తున్నట్లుగా అన్పించేదే కాదు. నా దృష్టిలో ఆయనొక గురువు. నేను ఆ గురువాక్కును శ్రద్ధగా పాటించే శిష్యుణ్ణి.

గ్యాన్ ముఖర్జీ నిజంగా ఆపదల్లో ఆదుకోగల స్నేహితుడు. ఇతరుల ఆశయాలను ఒక క్రమ పద్ధతిలో పెట్టగలశక్తి, ఆయన దగ్గర ఉంది. ఎదుటివారిలోని మనఃక్లేశాన్ని, వారి భావాలను, బాధలను గుర్తించగల నేర్పు ఆయన దగ్గర ఉంది. అందువలననే నాకు తెలియకుండా నాలో నిగూఢంగా నటుని ప్రతిభ ఉందని గ్రహించి, నేను నటుడుగా తయారుకాగల ఉత్సాహాన్ని నాలో కల్గించారు. కళాకారుడు ఎక్కడైనా రాణించాలంటే ఆతనికి ఉత్సాహం కల్గించట మనేది చాల ముఖ్యం. ఇది ముమ్మాటికి నిజం. అలాంటి ఉత్సాహాన్ని కల్గించిన వ్యక్తి గ్యాన్ ముఖర్జీ. నిర్మాత లందరూ పొమ్మంటున్న రోజుల్లో రమ్మని నన్ను అదరించిన వ్యక్తి ఆయన.

ఆయనతో సాహచర్యం పెరిగినకొద్దీ ఆయన ప్రతిభా విశేషాలపై గురి ఎక్కువయ్యేది. ఆయన లేకపోవటం నాకు ఎంత బాధగా ఉందో చెప్పలేను. నా కష్టాలన్నీ పాలుపంచుకుని నేను సుఖపడే రోజుల్లో, నా విజయంలో భాగం అనుభవించాల్సిన రోజుల్లో నాకు దూరమయ్యాడు ఈ లోటు ఏనాటికీ, ఏ రీతినా భర్తీ కాదు

ఆ మరువలేని వ్యక్తిని గూర్చి ఇంత చెప్పినా ఇంకా చెప్పాలనే అనిపిస్తున్నది కాని, మాటలు !



# అవీ-ఇవీ-అన్నీ

9 వ పేజీ తరువాయి

విజయనగరం మహారాజా. 1888 లో నిర్మాణమైన ఈ భవనం తరువాతనుంచి నగరంలోని వివిధ కార్యక్రమాలకు తావవుతూ వచ్చింది.

## ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి పునర్జన్మ

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి 'పునర్జన్మ' చిత్రమును ఈ నెల 29వ తేదీన విడుదల చేయుటకు నిశ్చయించారు. ఈ చిత్రంలో మతి భ్రమించిన చిత్రకారునిగా నాగేశ్వరరావు, అతనిని మరల మామూలు మనిషిగా తయారు చేసి, అతని పునర్జన్మ ప్రసాదించిన యువతిగా కృష్ణకుమారి ప్రధాన భూమికలు నిర్వహించారు. యువదర్శకుడు శ్రీ కె. ప్రత్యగాత్మ దర్శకత్వం వహించిన యీ చిత్రంలో ఇంకా గుమ్మడి, రమణారెడ్డి, పద్మనాభం, ప్రభాకరరెడ్డి, కుటుంబరావు, రాజబాబు, సూర్యకాంతం, వాసంతి, హేమలత, సంధ్య, నిర్మల, విజయలక్ష్మి ప్రభృతులు నటించారు. సంగీతం, టి. చలపతిరావు. నిర్మాత: శ్రీ ఎ. వి. సుబ్బారావు.

* * *

## దర్శకుడు ఎ. ఎల్. వి. ప్రసాద్ యింట్లో వివాహం

తెలుగు, తమిళ, హిందీ చిత్రరంగాలలో దర్శకుడు, నిర్మాతగా ప్రఖ్యాతి గడించిన అక్కినేని లక్ష్మీ వరప్రసాద్ రెండవ కుమారుడు వి. రమేష్, బి. ఇ., ఎం. ఎస్., (అమెరికా)కు బళ్లారి వాస్తవ్యులు శ్రీ ముండ్లూరు వెంకట రమణారావుగారి పుత్రిక చి. సౌ. విజయలక్ష్మికి మద్రాసు ఎగ్మూరులోని ధర్మప్రకాష్‌లో 27వ, తేదీ రాత్రి 1 గం. 39 ని. లకు అతి వైభవంగా వివాహం జరిగింది. 28వ, తేదీ సాయంత్రం వధూవరులనాశీర్వదించ యేర్పాటైన విందుకు తెలుగు, తమిళ, హిందీ బొంబాయి నుండి చిత్రరంగాల నుండి ప్రముఖ నటీనటులు సాంకేతిక నిపుణులు హాజరయ్యారు. అతిథులను శ్రీ ప్రసాద్‌గారే స్వయంగా ఆహ్వానించారు. విందుకు ముందు కుమారి యామినీ కృష్ణమూర్తి కూచిపూడి సాంప్రదాయ నృత్యాలను చేసి ఆనంద పరవశుల్ని చేసింది.

## సినీ టెక్నీషియన్స్ అసోషియేషన్ ఎన్నికలు

పై అసోషియేషన్‌వారు నూతన సంవత్సరపు కార్యవర్గానికి ఈ క్రిందివారిని ఎన్నుకున్నారు.

శ్రీయుతులు పి. కృష్ణన్ (అధ్యక్షులు), ఎన్. శేషాద్రి, ఎం. లింగమూర్తి (ఉపాధ్యక్షులు), సి. వి. రామకృష్ణన్ (కోశాధికారి), ఎన్. రజనీకాంత్. కె. జె. మోహన్ (గౌరవ కార్యదర్శులు), ఎస్. బాలచందర్, ఎస్. కృష్ణస్వామి, పి. జి. మోహన్, వి. రామస్వామి, జి. యన్. బిందుమాధవ్, జి. వి. రమణి, వి. బాలకృష్ణన్, వి. ఎస్ నారాయణ



"లక్షాధికారి"లో కృష్ణకుమారి.



నాట్యనటి రాజసులోచన "ఆప్తమిత్రులలో"

అయ్యంగార్, కె. ఎస్. సాంబప్ప (కార్య నిర్వాహక వర్గ సభ్యులు)

## సుజాతాచిత్ర ప్రొడక్షన్స్ నెం 1

పై సంస్థవారు జానపద చిత్రాన్ని నిర్మిస్తున్నట్లు ఈ చిత్ర నిర్మాత తెలియ జేశారు ఈ చిత్రంలో కృష్ణకుమారి, హేమలత, రేలంగి, రాజనాల, రామయ్య, మిక్కిలినేని, కళ : సోమనాథ్, స్టూడియో : కోల్డెన్, కూర్పు : హనుమంతరావు, దర్శకుడు : హొసూర్‌ కృష్ణమూర్తి, కథ, మాటలు, నిర్మాత కనకమేడల వెంకటేశ్వరరావు

## అవీ - ఇవీ - అన్నీ

### దర్శకుడుగా-రచయిత శ్రీ యదవల్లి

లోటా సంస్థ అధినేత యడవల్లి లక్ష్మీనారాయణ "అమ్మా— నాన్నా" చిత్రాన్ని ప్రారంభించారు మొదటి షాట్‌కు శ్రీ సరస్వతి టాకీసు మేనేజింగ్ డైరక్టర్ శ్రీ హనుమంతరావుగారు స్విచ్ ఆన్‌చేశారు శ్రీమతి షావుకారు జానకి



'మూగమనసులు'లో సరోజాదేవి.

క్లాప్ కొట్టింది. అదే సెట్‌లో రీ కాల్‌షీటు పని పూర్తిచేశారు. ప్రారంభం రోజున సెట్ మీద హరనాథ్, హేమలత పాల్గొన్నారు.

ఈ చిత్రంలో నాగయ్య, హరనాథ్, రాజనాల, బాలకృష్ణ, జానకి, హేమలత, రాజశ్రీ మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి కథ, మాటలు, దర్శకత్వ బాధ్యత నిర్మాత,కూడా యడవల్లి లక్ష్మీనారాయణ వహిస్తున్నారు. సంగీతం : టి. వి. రాజు, ఛాయ : మల్లి ఇరానీ, కళ : రాజా, కూర్పు : మార్తాండ్, స్టూడియో : మెజిస్టిక్ స్టూడియో.

తన చిత్రంలో నటిస్తున్న నటీ నటులకు, పనిచేస్తున్న సాంకేతిక వర్గానికి శ్రీ నాగయ్య ద్వారా పూలమాలాలంకృతుల్ని చేసి శ్రీ యడవల్లి సత్కరించారు.

జ్ఞానలోచనరావు అనే యువకుణ్ణి ఈ చిత్ర ఈ చిత్రంలో పరిచయం చేయబోతున్నారు.

## బెంగుళూరులో "లవకుశ" చిత్రం శతదినోత్సవం

ఆంధ్ర దేశమంతటా అఖండంగా విజయభేరి మ్రోగిస్తున్న గేవాకలర్ చిత్రం బెంగుళూరులో కూడ విడుదలయింది. దిగ్విజయంగా 100 రోజులు నడిచింది. శత దినోత్సవానికి నటీనటులు, సాంకేతిక వర్గం బెంగుళూరు వెళ్ళింది.

కన్నడ దేశంలో పరభాషా చిత్రం 100 రోజులు నడిచి, శతదిన ఉత్సవము కూడా జరుపుకున్నందుకు కన్నడ సోదరులకు ఈర్ష్య కలిగి గల్లంతు చేసినట్లు తెలుస్తుంది. రాష్ట్రంలోనే కాదు— దేశంలోనే కాదు— ప్రపంచంలో అన్ని దేశాలలో కూడ ఇతర భాషా చిత్రాలు వేస్తు

క్లైపిస్టువేషంలో ఆఫ్రికన్ అందాల నటి సైమోన్ సిమియన్‌గాలి.

న్నారు. వాటిలో ఉన్న విజ్ఞానాన్ని, క్రొత్తదనాన్ని తెలుసుకుంటున్నారు. ఒక భాషలో తీసిన చిత్రాలు ఆ భాషా ప్రాంతంలోనే నడిపించాలంటే నిర్మాతల కు— నటీనటులకు— సాంకేతిక వర్గానికి— ప్రేక్షకులకు— చివరకు ప్రభుత్వానికి కూడ నిరుత్సాహం కలుగుతుంది. అనేక విధాలుగా నష్టం కలుగవచ్చు. ఆ విధంగా ప్రవర్తించినందుకు చింతించాల్సి వస్తుంది.

## "దాగుడు మూతలు"

"యెంకొచ్చిందోయి మావ యెంకొచ్చిందోయి" పాట ఆరుద్రచే వ్రాయబడింది. పి. సుశీల పాడగా రికార్డు చేశారు.

రామారావు ఇంట్లో సరోజాదేవి అద్దెకు ఉంటుంది. అంతే ప్రేమించుకొనడం ప్రారంభిస్తారు. చిత్రంలో బి. సరోజాదేవి, రామారావులతో చిత్రీకరణ చేస్తారు.

సరోజాదేవి పాడుతుంది. రామారావు (మూకాభినయం) చేస్తాడు.

ఈ చిత్రంలో యన్. టి. రామారావు, బి. సరోజాదేవి, గుమ్మడి, రమణారెడ్డి, పద్మనాభం, అల్లురామలింగయ్య, సూర్యకాంతం, శారద, మొదలగువారు నటిస్తున్నారు. ఇంతేగాక సుమ, అముద, తార, లత అనే నలుగురు బాలికలు కూడా నటిస్తున్నారు.

ఈ పాటను వాహినీ స్టూడియోలో చిత్రీకరించారు. ఆ రోజు షూటింగ్‌లో బేబి అవంతి (4 సం.లు) కూడ ఉంది. మధ్యాహ్నం విరామ సమయంలో ఆ చిత్ర దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు — నేను మాట్లాడుకుంటున్నాను. బేబి అవంతి పరుగెత్తుకొని మా దగ్గరకువస్తూ



"పునర్జన్మ"లో నాగేశ్వరరావు, వాసంతి.



'బందిపోటు'లో ఒక దృశ్యం.



"తోబుట్టువులు"లో జమునా, జగ్గయ్య.

"పునర్జన్మ"లో ఒక దృశ్యం.



## అవీ - ఇవీ - అన్నీ

"ఐ వాంట్ వక్కపొడి" అంది "గుడ్ వక్కపొడిని కూడా ఇంగ్లీషులో అడిగితే ఇస్తాను" అని నవ్వుతూ వక్కపొడి డబ్బా ఇచ్చేను తీసుకొని పారిపోయింది

ఈ చిత్రానికి మాటలు ముళ్లపూడి వెంకట రమణ, సంగీతం కె వి మహాదేవన్, ఛాయ : పి యల్ రాయ్, కళ కృష్ణారావు, నృత్యం : కె యస్ గోపాల్‌కృష్ణ, కూర్పు టి కృష్ణ, నిర్మాత డి బి నారాయణ, స్క్రీన్‌ప్లే దర్శకత్వం ఆదుర్తి సుబ్బారావు

## "మూగ మనసులు"

"గౌరమ్మా నీ మొగు డెవరమ్మా "

పై పాటను కొసరాజు వ్రాశాడు ఘంటసాల, సుశీల పాడగా రికారు చేయబడింది నాగేశ్వరరావు, జమునల నృత్య సన్నివేశంలో చిత్రీకరణ చేస్తారు

ఈ చిత్రంలో నాగేశ్వరరావు, సావిత్రి, జమున, గుమ్మడి, పద్మనాభం, సూర్యకాంతం, మొదలగువారు నటిస్తున్నారు

దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు, కవిద్వయం ముళ్లపూడివెంకటరమణ, ఆచార్య ఆత్రేయ ముగ్గురూ కలిసి సృష్టించినదే ఈ "మూగమనసులు" కథ మాటలు ఆత్రేయ, సంగీతం కె వి మహాదేవన్, నృత్యం కె యస్ గోపాలకృష్ణ, ఛాయ పి యల్ రాయ్, కళ జి వి సుబ్బారావు, కూర్పు టి కృష్ణ, స్క్రీన్‌ప్లే : దర్శకత్వం ఆదుర్తి సుబ్బారావు, నిర్మాత : సి సుందరం

## "ఆర్యన్ ప్రొడక్షన్సు"

ఆర్యన్ ప్రొడక్షన్సువారు తమ ప్రథమ చిత్రం "ప్రభావతీ ప్రద్యుమ్నం" అనే పౌరాణికాన్ని తీయనున్నారు

ఈ చిత్రంలో హరనాథ్, యస్ వి రంగారావు, సురభి బాలసరస్వతి, అమరనాథ్, రఘురామయ్య, మొదలగువారు నటిస్తున్నారు కథానాయకిని ఇంకా నిర్మాతలు బుక్ చేయలేదు త్వరలో చేయనున్నట్లు నిర్మాత తెలియజేశారు

ఈ చిత్రానికి మాటలు దాసం గోపాలకృష్ణ, పాటలు దాసం గోపాలకృష్ణ, తదితరులు, సంగీతం కోదండపాణి, ఛాయ మల్లియరాసి, నృత్యం : గోపాలస్వామి, కళ చలం, దర్శకత్వం హనుమాన్ కృష్ణమూర్తి, నిర్మాతలు ఏ నాగయ్యనాయుడు అండ్ పి వెంకటేశ్వరరావు

త్వరలో మెజిస్టిక్‌లో షూటింగ్‌చేయనున్నారు

## సెట్టుమీద గురువును మించిన శిష్యుడు

"మహామంత్రీ ఈ దినం! మాకెంత ఆనందదాయక మైనదో అంత ఆందోళనకరంగా ఉంది

"అదేమిటి ప్రభూ!"

"చూడండి! ఈ దినంతో మన గారాలు బిడ్డ లీలావతికి పదునెనిమిది వసంతాలు గడిచిపోయాయి యుక్త వయస్సు వచ్చింది"

"కానాను ప్రభూ! [illegible]",

"[illegible]

బొంగ్రముకు, ఈ రతనాల కొప్పుకు, ఈ ముత్యాల గుమ్మకు, తగిన వరుడు లభిస్తాడా అని మా అందోళన ఏమమ్మా"

"హ హ హ "

"అదేమిటమ్మా ! ఆ నవ్వు ?"

"పెండ్లిమాట అనేసరికి అమ్మాయిగార్కి సిగ్గు ఆవరించింది ప్రభూ !"

"వ్హా వ్హా " (ఏడుస్తుంది)

"అయ్యో ! అయ్యో ! ఏడుస్తున్నా వెందు కమ్మా ! ఏమయిందే ?"

"కోవటి క్రొత్త బెల్లం కొంటావా ? తింటావా ? కొంటే డబ్బు ఖర్చు తింటే కడుపునొప్పి"

"ఆ ! అమాయ్ ! లీల "

"బుర్ బుర్ బుర్ (జిర్రు వింటోసు కుంటుంది )

"లీలావతీ "

"ఎవడ్రా నువ్వు కొరికేస్తాన్ దగ్గరి కొస్తావా నమిలేస్తాన్ కుమ్మేస్తాన్ చిమ్మేస్తాన్ దున్నే వస్తాన్ తన్నేస్తాన్ "

"మహామంత్రీ—ఏమిటో అమ్మాయి యిలా ఘూట్లాడుతోంది"

"అమ్మాయిగారు జన్మదిన మహోత్సవం చేసుకున్నారు కదండీ ఎవరిదైనా దృష్టి తగిలిందే దేమో ! శాస్త్రిగారు కాస్త దిష్టి తీయండి చూద్దాం "

"ఓం ! శ్రీం ! క్లీం ! హ్రీం !"

"ఢూం ! ఢాం ! ఢస్ !"

'అమ్మ భాభోయి ! ప్రభూ ! ఇది భూతచేష్ట, ప్రేతచేష్ట'

"పోల్వావురా పుత్రా ! నేను న్ని"

"భగవంతుడా ఇదేం గ్రహచారం తంత్రీ, ఆర్యా ! ఏమి టిప్పుడు కర్తవ్యం—తొందరగా చెప్పండి నాకు మతిపోయిన ట్లుంది"

"ప్రభూ ! ఆ భూతానికి కావలసిన దేదో పెడితే అదే వదిలిపోతుంది"

"అలాగా ! అమ్మా ! నీకేమి కావాలో కోరుకో— నా చిట్టి తల్లిని మాత్రం వదలిపో"

"ఒరే నేను ఆడభూతాన్ని కాదురా మగ భూతాన్ని"

"సరే ! ఏం కావాలి "

"అర ముగ్గిన అరటిపళ్లు ఖర్జూరకేళీ అంటి పళ్ళు ఒక గెల"

"ఒరే తీసుకురండిరా"

"ఇక వెళ్లిపో"

"కొబ్బరికోరు పూర్ణం పెట్టిన బూరెలు కావాలి బొప్పాయిపళ్లు నాలుగు పనసపళ్లు యాభై బొబ్బట్లు ఒక దొంతెడు, అప్పాలు బుట్టెడు కోడిపులావు—బిందెడు పాలు, రెండు బిందెల పుట్ట తేనె"

"సరే ఇప్పిస్తా ! తెప్పించండి అమాత్యవర్యా!

"ఇది మహా చిత్రంగా ఉందే పెట్టినవన్నీ అరగించి యింకా వదలడంలేదే ఆ భూతం"

"అదే నేనూ ఆలోచిస్తున్నా ప్రభూ ! ఎందరు వచ్చినా ఏమీ ప్రయోజనం లేకపోయింది"

"ప్రభూ ! ఇతడు మళయాళ మంత్రికుడు ఏ భూతోపాసన చేసినవాడు చిటికలో వదిలిస్తా నంటాడు"

"అయ్యా ! మీరు ఆ భూతాన్ని వెడలగొడ్తే మీరు కోరినది ఇస్తా !"

"ఏదో చేసి యీ బాధ తప్పించండి బాబ్బాబూ మీ పుణ్య ముంటుంది"

"ఖైటు తాళం బిగించండి ఆ భూతం నా గొంతుకతో తిట్టమని వెయ్యి విధాల ఏడ్పి గోల పెట్టినా తెరవకండి"

'సరే ! అలాగే వెళ్లండి"

"మాంత్రికుడు. మాంత్రికుడు."



అద్దంలో అందం చూసుకుంటున్న నటి గీతాంజలి ఫొటో: ప్రభాకర్.

"అర ఘడియలో పొందోల్తా గాని ఒక షరతు"

"ఏమిటది"

"భూతం ఉన్న మందిరంలోకి ఒక్కణ్ణే వెళ్తాను మీ రెవ్వరూ రాకూడదు చూశారా ! ఈ ఘట — ఇందులోకి ఆ భూతాన్ని ప్రవేశ పెట్టి చిలపేసి తీసుకుపోతాను"

"అయ్యో ! అయ్యో !"

"వీజో దండం వస్తా !"

"అమాత్యవర్యా ! ఏమిటి దారి నా పిన్నారికి ఈ పీడ తొలగదా—దండోరా వేసి, ప్రకటించండి ఈ పీడ వదలించేవారికి అర్ధ రాజ్యంతో బాటు అమ్మాయి నిస్తాను"

"ఏతం"



'పునర్జన్మ' లో కృష్ణకుమారి

వర్ధమాన నటి స్వర్ణ



# అవి - ఇవి - అన్ని

ఈ పై సన్నివేశం విఠల్ ప్రొడక్షన్స్‌వారి "గురువును మించిన శిష్యుడు" చిత్రంలోనిది ఈమధ్య గోల్డెన్ స్టూడియోలో షూట్ చేశారు

రికార్డు చేసిన మూడు పాటలలోను ఒకటి నటి రాజశ్రీతోను, మరొకటి బాలకృష్ణ—లక్ష్మీదేవి (నూతన నటి) తోను చిత్రీకరించారు

ఈ చిత్రంలో కాంతారావు రాజనాల కృష్ణకుమారి సత్యన్నారాయణ, లంకాసత్యం బాలకృష్ణ, వల్లమాని విశ్వనాథం, మద్దాలి కృష్ణమూర్తి, రాజశ్రీ, బృందావనం, రమాదేవి మొదలుగువారు నటిస్తున్నారు

ఈ చిత్రానికి మాటలు పాటలు జి కృష్ణమూర్తి, ఛాయ రవికాంత్ సంగీతం కోదండపాణి నృత్యం చిన్నిసంపత్, కళ బి సి బాబు, కూర్పు గోవిందస్వామి, స్టూడియో గోల్డెన్, అసోసియేట్ డైరెక్టర్ సయ్యద్‌లాల్, నిర్మాత, దర్శకుడు బి విఠలాచార్య

## పద్మశ్రీ పిక్చర్స్

పద్మశ్రీ అధినేతలు మరొక క్రొత్త సాంఘిక చిత్రాన్ని తీయనున్నారు ఈ చిత్రానికి కథ, సుప్రసిద్ధ దర్శకులు శ్రీ పి పుల్లయ్యగారి రెండవ కుమార్తె కుమారి పి రాధ వ్రాసింది సంభాషణలు ఆచార్య ఆత్రేయ వ్రాస్తున్నారు సంగీతం: మాస్టర్ వేణు, ఛాయ మాధవ్ బుల్‌బులే, కళ: జి వి సుబ్బారావు నిర్వహిస్తారని తెలుస్తుంది ఈ చిత్రం హైదరాబాద్ సారథీ స్టూడియోలో సెప్టెంబరు నెల నుండి షూటింగ్ జరుగుతుంది.

ఈ చిత్రంలోని ఇప్పటివరకు నాగేశ్వరరావు, జమున, రమణారెడ్డి, సూర్యకాంతం శారదలను ఎన్నిక చేసినట్లు తెలుస్తున్నది మిగిలిన పాత్రధారుల్ని త్వరలోనే బుక్ చేసుకుంటారని కూడా తెలుస్తుంది

"కనులు కనులు కలిసెనో, కన్నె వయసు పిలిచెనో—"

అనే పాటను పి నారాయణరెడ్డి వ్రాయగా రికార్డు చేశారు

దర్శకత్వం పి పుల్లయ్య, నిర్మాత వి వెంకటేశ్వర్లు

## ది సినీమ్యూజీషియన్స్ యూనియన్

ఆగస్టు 15 వ తేదీని పై సంస్థ వారు సాంస్కృతిక కార్యక్రమాలకు ప్రారంభోత్సవం జరిపారు

ఈ సమావేశానికి దర్శకుడు కె సుబ్రహ్మణ్యం అధ్యక్షత వహించారు కుమారి రాగిణి (లలిత, పద్మినీ సోదరి) దీపారాధనతో ప్రారంభోత్సవం జరిగింది

సభికుల్ని జనరల్ సెక్రెటరీ శ్రీ టి చలపతిరావు ఆహ్వానించారు రత్న పాప నృత్యప్రదర్శన జరిగింది. నూతన గాయకుల్ని యిద్దర్ని వారి పాటలతో సహా సభికులకు పరిచయం చేశారు

తరువాత "సెలెస్టియల్ బ్రదర్స్" అనే సోవియట్ ఫిల్మ్ ప్రదర్శన జరిగింది

జనరల్ సెక్రెటరీ వందనసమర్పణతోను, జనగణ, మన తోను సభ జయప్రదంగా ముగిసింది.

ఈ శుభ సమయములో కుమార్ రాజా ఆవ్ ఉయ్యూర్ రామచంద్రరావు, బాలమురళీకృష్ణ (ఆల్ ఇండియా రేడియో మ్యూజిక్ ఇన్‌ఛార్జి) సంగీత దర్శకుడు ఘంటసాల, నేపథ్య గాయకుడు పి బి శ్రీనివాస్ జీవిత సభ్యులుగా చేరారు

## వేములవాడ భీమకవి

శ్రీ జగదాంబా ప్రొడక్షన్సువారు నిర్మిస్తున్న "వేములవాడ భీమకవి" చిత్రం ఈమధ్య కార కాంతరాలవల్ల ఆగి, తిరిగి ప్రారంభమవు తున్నట్లు తెలుస్తుంది ద్రాక్షారామం, వేములవాడ వాడ, కోటిపల్లి మొదలగుచోట్ల ఔట్‌డోర్ చిత్రీకరణ యిదివరకే జరిపేరు

ఈ చిత్రంలో కాంతారావు, కృష్ణకుమారి, రాజనాల, జి వరలక్ష్మి, రమణారెడ్డి, బాలకృష్ణ, పెరుమాళ్ళు, ప్రభాకరరెడ్డి మొదలగువారు ముఖ్య పాత్రలను నిర్వహిస్తున్నట్లు తెలుస్తుంది

మాటలు సముద్రాల రాఘవాచార్య, ఛాయ అన్నయ్య, సంగీతం సుసర్ల దక్షిణామూర్తి, కళ గోడ్‌గాంకర్, నిర్మాత : ఎం శంకర్, దర్శకుడు హనుమ్మారి కృష్ణమూర్తి

## అంజలీ పిక్చర్సు తెలుగు చిత్రం

అంజలీ పిక్చర్సువారి తాజా తెలుగు చిత్రం కూడా వారి హిందీ చిత్రం "ఫూల్ ఔర్ కాంటే" తో పాటే విజయా స్టూడియోలో షూట్ చేస్తున్నారు ఈపిరి పెట్‌వర్కు అయిన తరువాత శ్రీమతి అంజలి తిరుపతి వెళ్ళి శ్రీ వేంకటేశ్వర స్వామిని దర్శనం చేసుకు వచ్చింది కూడా

ఈ చిత్రంలో ఎన్ టి రామారావు, హరనాథ్, రేలంగి, రమణారెడ్డి, సి ఎస్ ఆర్ పద్మనాభం, అంజలీదేవి, గిరిజ, వాసంతి మొదలగువారు నటిస్తున్నారు

ఈ చిత్రానికి మాటలు డి వి నరసరాజు, ఛాయ కమల్ ఘోష్, కళ కృష్ణారావు, కూర్పు ప్రకాశ్, దర్శకుడు వేదాంతం రాఘవయ్య, నిర్మాత సంగీత దర్శకుడు ఆదినారాయణరావు

## "పెంచిన ప్రేమ"

శ్రీ కృష్ణసాయీ ఫిలింస్‌వారు "పెంచిన ప్రేమ" చిత్రాన్ని త్వరలో విడుదల చేయ నున్నారు ఈ చిత్రంలో ఎస్ వి రంగారావు, హర నాథ్, పి భానుమతి, జానకి మొదలగువారు నటించారు

మాటలు, పాటలు అనిసెట్టి, సంగీతం సుద ర్శనం, కూర్పు : బి గోపాలరావు, దర్శకత్వం కృష్ణన్‌పంజు, నిర్మాత యర్రా అప్పారావు

## "నరాంతకుడు"

మదరాసు సినీ లేబరేటరీ వారి చిత్రం "నరాంత కుడు" త్వరలో విడుదల కానున్నది. దర్శకుడు . రామన్న, మాటలు పాటలు : శ్రీ శ్రీ, సంగీతం : సామర్తి

## రాజసులోచన నృత్యప్రదర్శన

మదరాసు టి నగరులోని కేసరి హై స్కూలు నిధి నిమిత్తం ఈమధ్య టి నగర్‌లోని వాణి మహల్‌లో సినీమా నర్తకి రాజసులోచన నృత్య ప్రదర్శన యిచ్చింది ఈ ప్రదర్శనకు 33 వేల రూపాయలు వసూలైనట్లు ఆ స్కూలు నిర్వా హక కమిటీ కార్యదర్శి శ్రీహరిరావునాయుడుగారు తెలియజేశారు

## భరణీపిక్చర్సు సాంఘిక చిత్రం

భరణీవారు త్వరలో మరొక సాంఘిక చిత్రాన్ని నిర్మించడానికి కృషి చేస్తున్నారు "సాత్ పాకే బాంధ" అనే బెంగాలీ చిత్రంయొక్క హక్కులు చిత్రనిర్మాణంలో ఉండగానే భరణీవారు కొన్నారు పై చిత్రాన్ని మాస్కో ఫిలిం ఫెస్టి వల్‌కు పంపించడం జరిగింది ఆ చిత్రంలో నటించి సుచిత్రసేన్‌కు ఉత్తమ బహుమతి లభించింది దీనిని తెలుగులో భరణీవారు చిత్రీకరించనున్నారు రచన : విశ్వేశ్వరరావు, దర్శకత్వం పి రామకృష్ణ ఈ చిత్రంలో ప్రధాన పాత్రలు ఎన్ టి రామారావు రావు, భానుమతిగార్లు నిర్వహించనున్నట్లు తెలు స్తుంది

సి. ధర్మారావు. ★



హిందీ తార నిరూపరాయ్.

